# బ్రాహ్మణపిల్ల

శరత్ బాబు

అనువాదం:
శివరామకృష్ణ

దేశి కవితా మండలి; విజయవాడ-2.

దేశి ప్రచురణ
పునర్ముద్రణ
సెప్టెంబరు — 1960
వెల: రెండు రూపాయలు
దేశి ప్రెస్, విజయవాడ-2




సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

# బ్రాహ్మణపిల్ల

ఊరంతా తిరిగి తిరిగి మూడు గంటలవేళప్పుడు రాసమణి ఇంటికి బయలుదేరింది. ఆమె ముందు పది పన్నెండేళ్ళ మనమరాలు నడుస్తోంది. ఆ పల్లెటూరి ఇరుకు సందులో ఒక వైపున కట్టేసి ఉన్న మేకపిల్ల రెండో వైపుకు పోయి పడుకుని నిద్రపోతోంది. దానిమీద దృష్టి పడగానే రాసమణికి బిగ్గరగా — "ఒసేయ్! ఆ తాడు దాటబోకు! దాటబోకు! దాటావూ? కళ్ళు ఆకాశాన పెట్టుకుని నడుస్తున్నావా ఏమే పాపిష్ఠిదానా? అలా కట్టేసి ఉంచిన మేకపిల్ల కళ్ళకు కనిపించటంలా?" అని అరిచింది.

"మేకపిల్ల నిద్దరోతోంది నాయనమ్మా!" అన్నది మనమరాలు.

"నిద్దరోతోందా? అయితే ఇంక పోయేదేముంది? ఈ మంగళవారం పూటా నువ్వు చక్కగా కట్టు తాడు దాటావా?"

"దాటితే ఏమవుతుంది నాయనమ్మా?"

"ఏమవుతుందా? దౌర్భాగ్యురాలా! బ్రాహ్మణింట పుట్టిన పదిపన్నెండేళ్ళ అడముండవి — మేక కట్టు తాడు దాటకూడదని ఆ మాత్రం తెలియదూ? ఏమవుతుందీ — అని మళ్ళీ అడుగుతున్నావా? అడ్డమైనవాళ్ళు మేకల్ని మేపుకోవాలనే యావతో ఎక్కడపడితే అక్కడ వాటిని కట్టెయ్యటం మూలంగా నలుగురూ దారిని నడవటం మహా ఇబ్బందై

పోతోంది! జాబూ ఉస్ ! మంగళవారం మధ్యాన్నపూటా ఈ కుర్రది మేక కట్టుతాడు దాటింది- ఎంచేత? దారికడ్డంగా మేకల్ని ఎందుకు కట్టెయ్యాలి? వాళ్ళకు మాత్రం పిల్లా జెల్లా లేరా-అని అడుగుతా. ఏమైనా మంచీ చెడు అవుతుం దని వాళ్ళకిమాత్రం తెలియదూ ?"

హఠాత్తుగా ఆమెదృష్టి పన్నెండు పదమూడేళ్ళ యానాది పిల్లమీద పడింది. అది భయంతో గాభరాపడుతూ తన మేకపిల్లను అక్కడినుంచి తీసుకువెళ్ళటానికి వస్తోంది. అప్పుడామె, ఎదట లేనివాళ్ళని వదిలిపెట్టి ఎదురుగావస్తూన్న దీనిమీద పడి- తీక్ష్ణమైన కంఠంతో - "నువ్వొవత్తైవే, పాడు పీనుగా ! బాత్తుగా రాచుకునే పోతున్నావే! నీకు కళ్లూ చెవులూ లేవా ఏమే ? కన్పించటంలా ? నీ చెంగుకాస్తా పిల్ల దానికేసి కొట్టావూ ?" అంది.

ఆపిల్లది భయంతో-"లేదండి అవ్వగారూ! నేను ఇవ తలనుంచి వస్తున్నాను" అంది.

రాసమణి తన ముఖాన్ని అతి వికారంగా పెట్టి, "అవ తలనుంచి వెడుతున్నావా? నీకు అవతలనుంచి వెళ్ళాల్సిన అవసరమేముందే? ఈ మేకపిల్ల నీదే ననుకుంటా. నీ కులమే మిటే అసలు ?" అన్నది.

"మేము యానాదవాళ్ళం అవ్వగారూ !"

"ఉహూఁ అలాగా? ఈ వేళకాని వేళ నువ్వు మా పిల్లను తాకి స్నానం చేయిస్తావా ?"

"అది నన్ను తాకలేదు నాయనమ్మా !" అంది మన మరాలు.

రాసమణి గద్దిస్తూ – "నువ్వు ఊరుకోవే పాపిష్టి మొహమా! అదికొంగు నీకు తాకిస్తూ పోతూంటే నేను చక్కగా చూశా. పద, చెర్లో మునిగి చద్దువుకాని! మునిగాకే ఇంట్లో అడుగుపెట్టు. జాతీజన్మా ఇంక ఉండేట్టు లేవు బాబూ! అలగా జాతులవాళ్ళంతా అనుపు మీరిపోయారు. దేవతలన్నా బ్రాహ్మలన్నా లెఖ్క చేసేట్లు లేరు. పాడుముండా, మీ గుడిసెల్లోంచి బ్రాహ్మల వీధికి మేకను కట్టెయ్యటానికి వచ్చావా?" అంది.

ఆ యానాదిపిల్లకు కలిగిన భయానికీ, సిగ్గుక్కూ అంతు లేదు. అది మేకపిల్ల నెత్తుకుని, గుండె కదుముకుని "అవ్వగారూ, నేను తాకలేదండీ!" అనిమాత్రం అన్నది.

"తాకకపోతే ఈ వీధికి ఎందుకు వచ్చావ్? చావడానికి వచ్చావా ఏం?"

ఆపిల్లది చెయ్యి ఎత్తి దగ్గరలోనే ఎక్కడో ఉన్న ఒక ఇంటికేసి చూపిస్తూ "ఆ మహారాజువారి దొడ్లో ఒకమూల మమ్మల్ని కాస్త ఉండనిచ్చారు. మా అమ్మనీ నన్నూ మా తాత వెళ్ళకొట్టాడుగా మరి!" అన్నది.

ఎవరికయినా కాని, ఏవిధంగానయినా కాని పరాయి వాళ్ళకు దుర్దశ ప్రాప్తించింది – అన్న విషయం తెలుసుకోవటంలో కోపంగా ఉన్న రాసమణి హృదయం ఎలాగోరవంత వికసించింది. అంతేకాక వినసొంపు అయిన ఈ విషయాన్ని వివరం తెలుసుకోవాలనే కుతూహలం కలిగి, "నిజమే! అయితే ఎప్పుడూ వెళ్ళకొట్టింది?" అని అడిగిందామె.

"మొన్న రా లేనండి అన్నగారూ!"

"అయితే నక్సా ఆ యానాదిదాని కూతురివి అన్న మాట. ఇలా చెప్పు ఒకమూల చావుకు సిద్ధంగా ఉన్న ఆ ముసలిముండాకొడుకు మిమ్మల్ని తన్ని వెళ్ళకొట్టాడా? మీ అలగా జాతి మొహంమండ! ఆయన చోటు ఇచ్చాడుకదా-అని మీరువచ్చి బ్రాహ్మణవీధిలో కాపరం పెడతారా? మీకూ సాహసానికేం తక్కువలేదు. మీ అమ్మను ఎవరు తీసుకొచ్చారు? రామతను బెనర్జీ అల్లుడనుకుంటూ. లేకపోతే ఆపాటి మహావిద్య ఇంకెక్కడకుంది? ఇంటిఅల్లుడు ఇంటిఅల్లుడు గానే ఉండాలి. లేకపోతే మామగారి ఆస్తి వచ్చిపడిందికదా, అని బ్రాహ్మణ వీధిలో యానాదివాళ్ళనీ, ఎరికలవాళ్ళనీ, దొమ్మరివాళ్ళనీ, చమ్మరవాళ్ళనీ తీసుకొచ్చి పెడతాడా?"

ఇలా అని రాసమణి బిగ్గరగా "సంధ్యా! ఎమేవ్, సంధ్యా! ఇంట్లో ఉన్నావ్టే?" అని అరిచింది.

కొంచెం ఖాళీగా ఉన్న స్థలానికవతల రామతను బెనర్జీ ఇంటి గుమ్మం ఉంది ఆమె పిలుపు విని దగ్గరలో ఉన్న గుమ్మం తలుపు తెరుచుకొని సందామిని దేవ్ళ సుందరి ఒకతె ముఖం బైటికిపెట్టి, "ఎవరా పిలిచేది? ఓహో! అమ్మమ్మా, ఏం, ఎందుకమ్మా!" అంటూ ఆమె బైటకి వచ్చింది.

"మీనాన్న కిదేంబుద్ధే? విన్నావా, అమ్మాయీ! మీతాత రామతను బెనర్జీ ఎంత పేరు ప్రతిష్ఠలున్న కులీనుడు? ఆయన ఇంట్లో ఈనాడు యానాదివాళ్ళు కాపురమా? ఎంత ఘోరానా విషయమే మా అమ్మా!"

అంటూ ఆమె చెక్కిలిమీద చెయ్యివేసుకుని, మళ్ళీ చెప్పసాగింది. "మీ అమ్మను ఒకసారి పిలు! జగ్గు దీనికి తగిన ప్రతిక్రియ చేస్తుందా చేస్తుంది; లేకపోతే ఛటర్జీ దగ్గరకు నేనే వెళ్ళి చెప్పివస్తా. ఆయన పెద్ద జమీందారు. ఎంతో పేరూ ప్రఖ్యాతి ఉన్న గొప్పవాడు! ఆయన దీనికేం చెబుతాడో – ఒకసారి అదీ వింటాను"

సంధ్య ఆశ్చర్యంతో "ఏం జరిగింది అమ్మమ్మా?" అని అడిగింది.

"మీ అమ్మను పిలవ్వే ఒకసారి! ఏం జరిగిందో ఆవిడకే చెప్పివెడతా" అని ఆమె మనుమరాలిని చూపిస్తూ– "ఈ పిల్లది మంగళవారం మధ్యాహ్న పూజా మేక కట్టు తాడు దాటింది. ఈ రోనాదిముండ దీన్ని కొంగేసి తాకింది" అన్నది.

"నువ్వు తాకావుటే?" అని సంధ్య ఆ పిల్లముండని అడిగింది.

అది పాపం, ఆ మేకపిల్లను గుండెకు అదుముకుని ఇంత సేపటినుంచీ ఒక ప్రక్కగా నుంచుని ఉంది. అది ఒప్పుకోకుండా ఏడుపుగొంతుకతో "లేదండీ అమ్మా!" అంది.

రాసమణి మనమరాలుకూడా – దాని మాటల్లో తన మాటలుకూడా కలిపి, "లేదు అక్కా! అది నన్ను తాకలేదు. అటువైపునుంచే—"

కాని ఆ పిల్లదాని మాట రాసమణి హుంకారంతో అక్కడితో ఆగిపోయింది.

"మళ్ళీ లేదంటున్నావా పాడు మొహమా! పదముందు ఇంటికిపద. ముట్టుకుందో లేదో, అక్కడకు వెళ్లాక చూపిస్తా."

సంధ్య నవ్వుతూ, "బలవంతంగా ముంచుతావు కాని, అంతకన్న ఇంకేంచేస్తావు అమ్మమ్మా" అంది.

సంధ్య నవ్వుతో రాసమణి మండిపడింది. "బలవంతమో, కాదో నాకు తెలుసు. కాని మీనాన్న కిదేం పని? కాని ఏ పెద్దమనిషి తన ఇంట్లో కులం తక్కువవాళ్ళని తెచ్చి పెడతాడు చెప్పు? అంతా అలగాజాతివాళ్ళంటారు సాంఘికంగా. అలాంటి అలగాజాతివాళ్ళను తెచ్చి బ్రాహ్మణవీధిలో పెట్టాడు. ఇల్లరికపు అల్లుడు ఇల్లరికపు అల్లుడుగా ఉంటేనే మంచిది సుమా!"

తండ్రిని గురించి ఇలా అవమానకరంగా మాట్లాడడంతో సంధ్యముఖం కోపంతో ఎర్రపడింది. ఆమెకూడా కటువుగా జవాబు ఇచ్చింది. "నాన్నగారు పరాయివాళ్ళ ఇళ్ళల్లోకి కులం తక్కువవాళ్ళను తెచ్చిపెట్టలేదమ్మమ్మా! బాగా ఆలోచించే తన చోటులో వాళ్ళకు కాస్త ఆశ్రయమిచ్చారు. ఈమాత్రందానికి నీకింత వళ్ళుమంట దేనికి?"

"నాకు వళ్లుమంట ఎందుకా? ఎందుకో మంట - చూద్దువుగానిలే! ఒకసారి ఛటర్జీ దాదా ఇంటికి వెళ్ళనా? వెళ్ళి చెప్పిరానా?"

"ఆఁ, మంచిదే .. వెళ్ళి చెప్పరాదూ! నాన్నగారు ఆయన చోటులోకి ఏమన్నా తీసుకొచ్చి పెట్టాడా యానాది వాళ్ళని? ఆయన మహా గొప్పవాడని చెప్పి నాన్నగారి తల తీసేస్తాడా?"

"ఓ నిజమే. ఏం ముఖమే మా అమ్మా! ఆ ముఖానికి తగ్గట్లే ఉన్నాయి ఆ మాటలు! ఇదుగో, ఆయన మరెవరో కాదు – గోలోక ఛటర్జీ సుమా! ఆయన ఎలాంటివాడో మీనాన్న ఇప్పటికీ తెలుసుకోలేదనుకుంటాను – సరే..."

ఈ గందరగోళమంతావిని జగద్ధాత్రి బైటికివచ్చింది. ఆమెను చూసీ చూడటంతోటే రాసమణి అగ్నిజ్వాలలాగా మండిపడి, ఊరంతా ఎగిరిపోయేట్లు పెద్ద గొంతుకతో – "విన్నావా జగ్గా! నీ కూతురు విద్యాధరి అతిశయం మాటలు కాస్త విను ఓసారి! చదువు సంధ్యలు నేర్పించావుగా – 'పోయి చెప్పుకో గోలోక ఛటర్జీతో – మా నాన్న తల తుంచేస్తాడు కాబోలు. యానాదివాళ్లనైనా, ఎలికలవాళ్లనైనా మా ఇంట్లో మేం పెట్టుకున్నాం, కాని ఎవరి అబ్బగాడి చోటు లోనూ పెట్టలా. ఇలాంటి గొప్పవాళ్ళని చాలామందిని చూశాం, చెయ్యగలిగిందేమిటో చేసుకో' అంటోంది. విను అమ్మా! నీ కూతురుమాటలు ఓసారి విను" అంది.

జగద్ధాత్రి ఆశ్చర్యపడి "అన్నావా, ఈ మాటలన్ని?" అని అడిగింది కోపంతో.

సంధ్య తలతిప్పుతూ "నేనేం అనలే" దన్నది.

రాసమణి సంధ్యని బుగ్గలు పొడుస్తూ "అనలేదూ! వీళ్ళంతా సాక్ష్యంలేరూ?" అని గర్జించింది.

కాని మరుక్షణంలోనే తన కంఠస్వరాన్ని అనిర్వచనీయ కౌశలంతో సప్తమ స్థాయినుంచి మందరంలోకి దించి, జగద్ధాత్రిని ఉద్దేశించి చెప్పటం మొదలెట్టింది. "నేను మంచి

గానే చెప్పినమ్మా, యీ మంగళవారంపూటా పిల్లది మేక కట్టుత్రాడు దాటింది అందుకని, 'ఏమే ఈ దారిలో మేక పిల్లను తెచ్చి ఎవరు కట్టేశారు?' అని అడిగాను. అంతే, ఈమాట వినపడేసరికి యీనాటిపిల్ల పరుగెత్తుకుంటూ వచ్చి తురదాని ముఖంమీద కొంగేసి కొట్టి –'ఈ మహారాజుగారి చోటులో మేకను కట్టేసుకున్నాం. నువ్వెవరివి అడగటానికి'? అన్నది. అంతేత మీ అమ్మాయిని పిలిచి–'అమ్మాయీ? వేళ కానివేళ దీన్ని స్నానంచేయించాల్సివచ్చింది, మంగళవారం పూటా మేకతాడు దాటింది – మీనాన్న వీళ్ళందర్నీ ఎక్కడెక్కడినుంచో తెచ్చి ఇక్కడ పెట్టాడు. అయినా మేకల్ని కాస్త చూసి కట్టెయ్యించమని చెప్పు. తక్కువ జాతివాళ్ళకు ఆచారం, అనాచారం అన్న జ్ఞానం ఉండదు. అదీకాక ముసలివాడు ఛటర్జీబాబున్నాడు. ఈ దారిని తరచుగా వస్తూ పోతూ ఉంటాడు. వృధాగా ఆయన కోప్పడతాడు'– అంతే. ఈ మాటలుమాత్రం అన్నానమ్మాయీ! ఇహ ఈ మాటకు నీ కూతురు నన్ను కొట్టకం మాత్రం కొట్టలా. 'పో, పో, మీ ఛటర్జీబాబును పిలుచుకురా. ఆయనెంత పెద్దమనిషో నేనూ చూస్తాను. ఆయన బాబుగారి చోటులో అంటరాని వాళ్ళను తెచ్చిపెడితేగా ఆయన శాసించటానికి రావటం –' అన్నది. సరే నువ్వేచెప్పు అమ్మాయీ! ఇవి ఆడపిల్ల అన వలసిన మాటలేనా?"

జగద్ధాత్రి మండిపడి, "అన్నావా ఈ మాటలన్నీ?" అన్నది.

సంధ్య ఇంతవరకూ విస్తుపోయి రాసమణి ముఖంకేసి చూస్తూ నుంచుని ఉంది. తల్లి కంఠస్వరంవిని ఉలిక్కిపడి మెడతిప్పుతూ 'లేదు' అని మాత్రం అన్నది.

"అనలేదూ? అయితే పిన్ని అబద్ధం చెప్తున్నదంటావా?"

"అడుగు అమ్మాయీ! అల్లా అడుగు నీ కూతుర్ని ఒకసారి" అన్నది రాసమణి.

సంధ్య ఒక్కక్షణం మౌనం వహించి తల్లిమాటకు సమాధానం ఇచ్చింది. "ఎవరిమాట అబద్ధమో నాకు తెలియదమ్మా! కాని నువ్వు నీ కన్నకూతురికన్న, ఎక్కడి చుట్టమో అయిన పిన్నినే ఎక్కువగా విశ్వసించేటట్లయితే, అవే నిజమనుకో."

ఇలా అని ఆమె రెండో ప్రశ్న వేయకమునుపే, తెరచి ఉన్న గుమ్మంలోనుంచి లోపలికి వెళ్ళిపోయింది. ఇద్దరూ కళ్ళు ఇంతచేసుకుని, అటుకేసి చూస్తూ ఉండిపోయారు. సమయం కనిపెట్టి ఆ యానాదిపిల్లకూడా ఆ మేకపిల్లను అలాగే అక్కున చేర్చుకుని మెదలకుండా అక్కడనుంచి జారుకుంది.

"చూశావుగా జగ్గూ, నీ కూతురి అతిశయం! వినావుగా ఆ మాటలు? దూరపుచుట్టానిట! కులీనుల పిల్లకదూ! అందుకని అంటోంది. పెళ్ళికనుక అయి ఉన్నట్లయితే ఈ పాటికి అయిదారుగురు పిల్లలతల్లి అయివుండేది! దూరపు చుట్టముట పిన్ని—వినావుకదూ!"

జగద్ధాత్రి మెదలకుండా ఊరుకుంది. రాసమణికూడా కాస్సేపు అలాగే మెదలకుండా ఊరుకుని, హఠాత్తుగా "ఆఁ జగ్గూ! అమృత చక్రవర్తికొడుకు మీ ఇంటికింకా వస్తూనే ఉన్నాడటగా! నిజమేనా ఆ సంగతి?" అన్నది.

జగద్ధాత్రి ఇది విని మనస్సులో చాలా భయపడింది.

"ఆ రోజున పులినుడి తల్లికీ నాకూ పెద్ద పోట్లా టయింది. ఏమన్నానో తెలుసా? 'ఆమె జగద్ధాత్రి కాని మరెవరూ కాదు. హరిహర బెనర్జీ మనుమరాలు, రామతను బెనర్జీ కూతురు - వాళ్ళేవళ్లూ శూద్రులనిచెప్పి, కాయస్థుల ఇళ్ళల్లో ఎన్నడూ కాళ్ళయినా కడిగేవారు కారు. అలాంటి వారి ఇంటపుట్టిన జగద్ధాత్రి తనఇంట్లో ఎన్నడైనా మ్లేచ్ఛుడిని అడుగుపెట్టనిస్తుందా? అదేమిటి మీరిలా అంటారు?' అన్నాను."

ఈ హితైషిణి సానుభూతికి జగద్ధాత్రి సిగ్గుపడుతూ నీరసంగా నవ్వి, "నువ్వు సరియైన సమాధానమే చెప్పావు పిన్నీ! కాని తెలుసా నీకు? చిన్నప్పటినుంచీ అరుణ్ ఇక్కడికి వస్తుపోతూ ఉండటం ఉందిగా! నన్ను 'పిన్నీ పిన్నీ' అని కూడా పిలుస్తూ ఉంటాడు-

"అంచేత ఒకవేళ ఎప్పుడైనా వచ్చినా- 'నువ్వు ఇంక మా ఇంటికి రావద్దు అరుణ్' అని చూస్తూ చూస్తూ నానోటి మీదుగా చెప్పలేకుండా ఉన్నాను. పాపం! తల్లిదండ్రులు లేని పిల్లవాడుకదూ, చూస్తే జాలివేస్తుంది పిన్నీ!" అన్నది.

రాసమణి మొదట్లో మాట్లాడలేకపోయింది. తర్వాత కోపంతో "ఓసి నీ జాలి తగలడా!" అన్నది.

హఠాత్తుగా ఆమెకోపం ఆఖరిమెట్టువరకు ఎక్కిపోయింది. ఆ కోపానికి అనుగుణంగా కంఠస్వరాన్ని కూడా అదుపులో పెట్టుకుని, "ఆ పొగరుమోతు వెధవ మామూలు ఘట మనుకున్నావా ఏం ? అలాంటి దుర్మార్గుడు ఊరంతా గాలించినా దొరకడు - నేను చెబుతున్నాగదా! ఛటర్జీదా అంటే జమీందారు అలాంటివాడాయన. ఆ కుర్రవెధవను స్వయంగా కబురెట్టి పిలిపించి, 'ఒరేయ్ అరుణ్! జీతం అక్కర్లేకుండా స్కాలరుషిప్పుమీద చదువుకోవచ్చుననే ఆశ గంగలో కలిపి, ఇంట్లో వున్నవాడివి ఇంట్లోనే ఉండిపో, సీమకు వెళ్ళకు' అని ఎన్నోవిధాల చెప్పాను. కాని వాడామాట ఏమన్నా వింటేనా? అంత గొప్పవాడి మర్యాదేమయినా నిలబెడితేనా ? ఆయన మాటలను ఎదిరించి సీమకు వెళ్ళటమే కాకుండా వెళ్ళేముందు ఆయన్ని అపహాస్యంచేసి 'విదేశాలకు వెళ్ళట్లయితేనే జాతిపోతే..., పోనీండి నాకదీ మంచిదే, కాని గోలోకఛటర్జీలాగా విదేశాలకు మేకల్నీ గొర్రెల్నీ ఎగుమతి చేసి డబ్బు సంపాయించాలని మాత్రం చూడనునేను. సంఘం నెత్తినెక్కి కూర్చుని, వారినీ వీరినీ జాతిభ్రష్టులని నిందిస్తూనూ తిరగను నేను' అన్నాడు. ఉన్, నేనేకనుక అప్పుడక్కడ ఉన్నట్లయితే, వాడిముఖంమీద చీపురు తిరగేసి చక్కచేసే దాన్ని. గోలోకఛటర్జీ అంటే, భోజనంచేసి గోమయంతో ముఖాన్ని శుద్ధిచేసుకొనేటంత ఆచారపరుడు. ఆయనెక్కడ ! వీడెక్కడ !-"

జగద్ధాత్రి వినీత కంఠంతో "కాని, అరుణ్ ఎన్నడూ ఎవర్నీ నిందించేవాడు కాదు పిన్నీ !" అన్నది.

"అయితే నే నబద్ధం చెబుతున్నా నంటావా! మరి ఛటర్జీ మహాశయుడు—"

"ఉహూ, ఉహూఁ, వారెందుకు అబద్ధమాడతారు? కాని లోకులే అభూతకల్పనలు చేసి చెబుతుంటారు"

"నీ కెప్పుడూ ఒకటేమాట జగ్గూ! లోకులకీ అతడికీ సహపంక్తి భోజనాలు లేవుకదూ! అందుకని కల్పిస్తారంటావు. సరే, విదేశాలకు వెళ్ళి వీడేమున్నా దిగ్గజమై వచ్చాడా? నేర్చుకుని వచ్చింది వ్యవసాయం. వింటే నవ్వుచేటు చక్రవర్తే! కాని, మరెవరైనా, కానీ బ్రాహ్మణపిల్లాడేగదా! దేశంలో రైతులు లేరూ? వీడు నాగలి బుజాన వేసుకుని దున్నటానికి వెడతాడా పొలాలవెంట? ఇంతకంటె చావేముంది?"

రాసమణి కంఠస్వరం తాలూకు తీవ్రసౌరభం క్రమంగా వ్యాపించబోతున్నదని పసిబట్టి, ఊళ్ళో పెద్దమనుష్యులంతా తేనెటీగల్లాగా ఎక్కడొచ్చి గుమిగూడతారో- అన్న భయంతో జగద్ధాత్రి మెల్లిగా - "నుంచున్నదానివి నుంచు న్నట్లే ఉండి మాట్లాడుతున్నావేం పిన్నీ! పద, లోపలికెళ్ళి కూర్చుదాం" అంది.

"వద్దు వద్దు. చాలా వేళదాటి పోయింది. ఇంక కూర్చోనులే. పిల్లనుకూడా స్నానం చేయించాలి. యానాది పిల్ల పారిపోయిందల్లే వుందే!"

"అవును నాయనమ్మా! మీ మాటల్లో వెళ్ళి పోయింది. కాని అది నన్ను తాకలా—"

"మళ్ళీ లేదంటున్నావా వెధవ పీనుగా!— కాని, జగ్గూ! నీతో సవినయంగా చెబుతున్నానమ్మా! వీధిలో

యానాది వాళ్ళను-కొమ్మరాళ్ళనీ తెచ్చిపెట్టవద్దు, అనిఅల్లు డితో కూడా చెప్పు"

"ఎందుకు చెప్పను పిన్నీ ! రేపే వీళ్ళను వెళ్ళకొట్టిస్తాను. వాళ్ళంటే మాక్కూడా ఇబ్బందే. నూతులు - చెరువులూ మైలపడేస్తారు. వాళ్ళు పారబోసిన నీళ్ళు; స్నానం చేసి మేమయినా తొక్కుకుంటూ పోవాల్సివస్తుంది."

"అలా చెప్పు అమ్మా ! లేకపోతే మనజాతి- జన్మ ఎలా నిలుస్తాయి మరి ! నేనిలా చెబుతున్నా కాని ఈకాలపు పిల్లలు కాస్తయినా లక్ష్యపెట్టరు. అంచేత ఆనాడు ఛటర్జీ బాబు విని ఆశ్చర్యపోయి...'రాసూ ! మీ జగద్ధాత్రి కూతు రికి వాళ్ళనాన్న చదువు సంధ్యలు నేర్పిస్తున్నాడని విన్నాను. వీళ్ళు మరీ ఇదయిపోతున్నారు. వద్దనిచెప్పు వద్దనిచెప్పు, ఆడ పిల్ల చదువు సంధ్యలు నేర్చిందంటే అంతా నాశనానికే దారి తీస్తుంది సుమా !' అన్నాడు."

జగద్ధాత్రి అంతులేని భయంతో "ఛటర్జీమామ అల్లా అని ఉంటాడా ?" అంది.

"ఎందు కనడు ? ఆయన సమాజానికంతా తల మానికం, ఊరికల్లా జమీందారు. ఆయన చెవిని ఏమాట పడకుండా ఉంటుంది చెప్పు ? పోనీ నన్నే తీసుకో—ముసలి దాన్నయిపోతున్నాననుకో—చదువు సంధ్యలూ ఏమీ ఎర గనే ఎరగను. కాని నాకు తెలియని శాస్త్రమేముంది చెప్పు? రాసమణి అశాస్త్రీయమైన పని చేసిందని చెప్పటానికి ఎవడి బాబుతరం ? ఈ కుర్రది మేక కట్టుతాడు దాటగానే నాకు ఒళ్ళు గరిపొడిచింది. వెంటనే 'ఎంత పనిచేశావే పాపిష్ఠి

దానా ! మంగళవారప్పూటా కట్టుతాడు దాటావా ?' అనేశాను. ఎవడు చెప్తాడో చూస్తాను. ఇందులో దోషం లేదని ఏ పండితుడంటాడో అనమను - అలా అనలేదమ్మా - అనలేదు. మేము మా తల్లిదండ్రుల దగ్గరే అన్నీ నేర్చుకొన్నాము. కాని ఏదీ నీ చదువుకున్న కూతుర్ని పిలు కాస్త. చూస్తాను. ఇలాంటి వేమైనా చెప్పగలదేమో !...

జగద్ధాత్రి మెదలకుండా ఆమె అన్నమాట నంగీకరించి, "కాస్త కూర్చుని వెళ్ళరాదు పిన్నీ !" అన్నది.

"లేదమ్మా - వేళ మీరిపోయింది. మరొకప్పుడెప్పుడైనా వస్తాలే. పదవే దున్నపోతా ! ఇంటికి పద."

ఇలా అని మనమరాలిని వెంట నడిపించుకుంటూ నాలుగడుగులు వేసి, చటుక్కన వెనక్కి తిరిగి—"ఏం జగూ! అంత మంచి సంబంధాన్ని జారవిడిచారు ఎందుకూ? కాస్త చెప్పు." అని అడిగింది.

"లేదు, ఇంకా చెయ్యిజారి పోనీయలేదు. కాని ఒక్క సంగతుంది. కాస్త యిల్లూ వాకిలీ అయినాలేదు—వయస్సు కూడా ముదిరింది. నీ అల్లుడికి ఇష్టంలేదు పిన్నీ !"

రాసమణి ఆశ్చర్యంతో అలాగే నిలబడిపోయి, "ఏం మాటలే! అతడికిల్లులేదు? నీకుందా అని అడుగుతున్నా ! నీకెవ్వరూ మగపిల్లలైనా లేరుగదా ! మరో ఆడపిల్లయినా లేదు. ఎందుకింత ఆలోచన ? ఒకత్తే కూతురాయె ! ఆ కూతుర్నీ అల్లుణ్ణి పెట్టుకుని చక్కగా కాపురం చెయ్యొచ్చు. అలా అయితే సంతోషానికి ఏమన్నా తక్కువటే ? ఇహ

వయసా ? కులీనుడైన గృహస్థుకు నలభై ఏళ్ళంటే అనో వయస్సు ముదరటమా ? రసికపురం జయరామ ముఖర్జీగారి దౌహిత్రుడంటే అతడి వయస్సు ఇంకెవరు చూస్తారు జగూ? అదీకాక నీ కూతురి వయస్సుకూడా ఎంతో అదీ కాస్త చూచుకోమరి ! ఇంకా తాత్సారంచేస్తే మరి పెళ్ళిఎప్పుడూ చెయ్యటం ? చివరికిహ మీ చిన్నత్తలాగా జన్మంతా కుమారిలాగానే కూర్చోపెడతావా, ఏం?" అన్నది.

జగద్ధాత్రి సిగ్గుపడుతూ—— "నేనూ ఈమాటే చెబుతున్నాను పిన్ని ! కాని పిల్లదాని తండ్రే బొత్తిగా——"

ఆమె మాట పూర్తి అయేంతవరకుకూడా ఓపిక పట్టలేకపోయింది రాసమణి. మండిపడుతూ - "పిల్లదాని తండ్రి ఎందుకలా అనడు ! ఆయనకు మహాఏనో ఇళ్లూ వాకిళ్ళూ ఎంతో జమీందారీ ఉందికమూ! వింటేనవ్వుకూడా వస్తుంది. అదీగాక, అరుణ్ ఇంట్లోనే రాత్రింబగళ్లు ఉంటం, పాట కచేరీలూ, హుక్కాకూడా త్రాగుతుంటారటగా, విన్నాను ! అలాంటిమాటలు ఆయననకపోతే ఛటర్జీబాబు అంటాడా ? హద్దుమీరిపోయారు జగూ ! కాని ఒక్కమాట చెపుతున్నా నమ్మాయీ ! వరుడు అంటూ దొరికినప్పుడు, అదీ — ఇదీ అని ఆలస్యంచేస్తూ కూర్చుంటే లాభంలేదు. అతిలోభం సర్వనాశనానికే దారితీస్తుంది. మీచిన్నమేనత్త వృద్ధకుమార్తెగానే ఉండి చచ్చింది. మీనాన్న మేనత్త లిద్దరికీ పెళ్ళిళ్ళే కాలేదుకదా! ఇహ మీ అమ్మా నానా్న కాశీ వెళ్ళకపోతే-నీకు మాత్రం సమయానికి పెళ్ళి అయ్యేదేనా? మీఅత్తగారు కాశీలో ఉంటోంది. వెనకాముందూ జంజాటమేమీలేదు.

నీమొగుడు స్కూల్లో చదువుకుంటున్నాడు. వరుడు దొరక గానే చటుక్కున మూడు ముళ్ళూ వేయించి, పిల్లనీ అల్లుణ్ణి వెంటపెట్టుకుని ఊళ్ళోవాళ్ళు ఊళ్ళోకి వచ్చేశారు. ఎవ్వరైనా కానీయకుండా చేస్తారేమో అనే భయంతో, ఎవరికీ కబురైనా పంపలా. అయితే మంచి పనిచేశార్లే! లేకపోతే పెళ్ళి అయ్యేదో కాదో, ఎవరికి తెలుసు! — పదవే పీనుగా, 'పద— జయరాం ముఖర్జీగారి మనుమడికి అందముందా? ఆస్తి ఉందాట! ఆరోజు కారోజు ఎలాంటి విచిత్రపుమాటలువినాల్సి వస్తోంది! పదవేపద, ఇహ ఆలస్యంచెయ్యకు. బట్టలూ— అవీ ఉతుక్కుని దీపారాధన చేసుకుని, జపం—తపంపూర్తి చేసుకునేసరికి — చూస్తున్నాగా — ఇవాళ రాత్రి ఝాము ప్రొద్దుపోయేటట్లుంది. కాని ఒక మాటమాత్రం ముఖ్యంగా చెప్తున్నాను జగూకి! రస్తాసి - గిరస్తానీ వాళ్ళని ఇంట్లో తిరగనియ్యటం, పిల్లవేదాంతో వేళాకోళాలు ఆడనివ్వటం మంచిదికాదు. ఆ సంగతి ఎక్కడన్నా పాకిందంటే మళ్ళీ మొగుడు దొరకటం చాలా కష్టమవుతుందమ్మా! పదవేమే మొద్దూ? పద, పరాయివాళ్ళమాటలు ప్రారంభమయా యంటే ఇహ కదలనన్నా కదలవు."

ఇలా వాగుతూ రాసమణి - మనమరాలు ముందూ, తాను వెనకా - బయలుదేరి వెళ్ళిపోతుంటే, జగద్ధాత్రి సంకోచంతో. ఇంత ముఖంచేసుకుని, అటేచూస్తూ నిలబడి పోయింది. అంతలోమళ్ళీ చటుక్కునత్రుళ్ళిపడి, "అమ్మాయీ కాస్త నిలుచో అమ్మా! నిన్న పొలంలోంచి ఇన్ని వంకా యలూ, సొరకాయలూ, చేమదుంపలూ వచ్చాయి. వాటిల్లో

కాసిని తీసుకుపోదువుగాని- క్షణంలో తీసుకొస్తా ఉండు—" అని జగద్ధాత్రి చటుక్కున లోపలికి వెళ్ళుతుండగా, రాసమణి ఆశ్చర్యపులకితయై "అరే! వంకాయలు అప్పుడే కాస్తున్నాయా?" అని కంఠస్వరాన్ని కొంచెం తగ్గించి "ఏమే మాడుమొహందానా! మొద్దులా అలా నుంచున్నావేమే! కూడా వెళ్ళవేం!"అంది.

మరుక్షణంలోనే మళ్ళీ వెనకనుంచి - "నేను ముందు నడుస్తూవుంటాను—నువ్వు పరుగెత్తుకురా!" అని పిలుస్తూ చెప్పింది.

౨

సంధ్య ముందర వసారాలో కూర్చుని శ్రద్ధగా ఏదో కుట్టుపని చేసుకుంటోంది. జగద్ధాత్రి జపతపాలు ముగించుకుని పూజామందిరంలోంచి బైటికి వచ్చి, కాసేపు కూతురి ముఖాన్ని నిదానంగా పరిశీలించి "ప్రొద్దున్నుండీ అంతగా కుట్టుతున్నావేమిటే సంధ్యా! రెండు ఝాములయింది. నీళ్లోసుకోవడం, తిండి తినడం అక్కర్లా? మొన్ననేగా పథ్యం పుచ్చుకున్నావ్? మళ్ళీ పైత్యం ప్రకోపించి జ్వరం వస్తుందేమో! నేను ముందుగానే చెబుతున్నా నీఇష్టం" అన్నది.

సంధ్య పైకిలాగిన సూదిని పళ్ళతో బిగపడుతూ "నాన్నగారింకా రాలేదమ్మా!" అంది.

"రాలేదని నాకూ తెలుసు. డబ్బూ - దుబ్బూ లేకుండా వైద్యం చేస్తూవుంటే ఎంత ప్రొద్దయినా ఎక్క-

తుంది. పోనీ నేనున్నానుగా. నువ్వుకూడా తినకుండా కూర్చో వాల్సినంత అవసరమేముంది ?"

సంధ్య మెదలకుండా తన పని తాను చేసుకుంటూ సమాధానం చెప్పలేదు.

"ఏమిటా కుట్టేది? చెబుదూ- వింటాను !"

సంధ్య అయిష్టంగా అస్పష్టస్వరంతో - "రెండు గుండీలు కుడుతున్నాను." అని జవాబిచ్చింది.

"ఆమాత్రం తెలుసమ్మా, ఆమాత్రం తెలుసు. లేక పోతే నా బట్ట కుడుతున్నావో లేదో అని అడుగుతున్నా నను కున్నావా ? ప్రపంచంలో ఇంకెవరికీ తండ్రులు లేనట్లు-ఏలా అయితేనేం మహా నీకే తండ్రి ఉన్నట్టు- ఏ చొక్కాకు గుండీ లూడిపోయాయో, ఏ ధోవతి ఎక్కడ కాస్త చిరుగుపట్టిందో, చెప్పులకెక్కడ కుట్లు ఊడిపోయాయో - ఈ పనుల్తోనే పగలూ రాత్రీ గడిచిపోతుంది నీకు - ఇంకేమీ పనులే లేనట్లు-"

సంధ్య కొంచెం తలయెత్తి చిరునవ్వు నవ్వుతూ "నాన్నగారి కీషయాలమీద దృష్టే ఉండదమ్మా!"అన్నది.

ఆ సమాధానం వినటంవల్ల సంతోషం కలగలా ఆతల్లికి, "ఎందుకుంటుందీ దృష్టి ? డబ్బులేకుండా చేసే డాక్టరీ వృత్తిలో తీరికుంటేగా ! అయితే యింతకీ ఆయానాది పిల్ల వెళ్ళిపోయిందీ ?"

"ఎందుకు వెళ్ళకుండా ఉంటుంది ?"

"ఎప్పుడూ ఇంతా ? ఇల్లూవాకిలీ అందర్నీ తాకి తగలె ట్టాకా?— మళ్ళీ కుడుతున్నా వేమిటి ? ఇంక లేవవా ఏమిటి?"

"నువ్వెళ్ళమ్మా! నేను ఇప్పుడేవస్తా."

"ఈ జబ్బుబంటికి నీకు తోచిందల్లా చేస్తూంటాడు. మీ ఇద్దరితో వాగలేక వాగలేక నాకుచచ్చి పోతోంది. ఇంక నాకీ సంసారం, ఇల్లూ అక్కర్లా. నేను మా అత్తగారి దగ్గరకెళ్ళి కాశీలోనన్నా ఉండిపోతా! మీకు ఇదే చెబుతున్నాను సుమా!"

ఇలా అని జగద్ధాత్రి కోపంతో ఇత్తడిబిందె తీసుకొని గబగబా చెరువుకు వెళ్ళిపోయింది.

సంధ్య అదోదృష్టితో అలా గేనవ్వుకుంటూ కూర్చుంది. కాని తల్లిమాటకు జవాబుచెప్పలేదు. ఆమె కుట్టుపని ఇంచుమించు పూర్తిఅయింది. సూదీ-దారం మొదలైనవన్నీ చిన్న సబ్బుబిళ్ళల పెట్టెలోపెట్టి లేవబోతోంది. ఇంతలో తండ్రి వచ్చిన చప్పుడువిని ఉలిక్కిపడి తల ఎత్తింది. ఆయనెప్పుడూ 'అతిబిజీ'గా ఉంటాడు. చేతిలో చిన్న హోమియోపతి మందులపెట్టె, చంకలో కొన్నివైద్యం పుస్తకాలతో ఆయన ఇంట్లో అడుగుపెట్టాడు. కూతుర్ని చూస్తూ "సంధ్యా! కాస్త లేచి, చప్పున నా మందులున్న పెద్దపెట్టె కాస్త - ఏం చెయ్యాలో తోచటంలా - ఇలాంటి చిక్కులో-"

అంటూ ఉండగానే సంధ్య గబగబాలేచి, తండ్రి చేతిలోఉన్న మందులపెట్టె, పుస్తకాలూ తీసుకుని, ఒక వైపున పెట్టి, సావిట్లో పరచిఉన్న చాపమీద ఆయన్ని చెయిపట్టుకుని కూర్చోపెట్టి, విసనకర్రతో విసురుతూ, "ఇవాళ ఇంత ఆలస్యమైంది ఏంచేతనాన్నా?" అనిఅడిగింది.

"ఆలస్యమా! నాకు తిండి తినేంత తీరిక కూడా ఉందను కుంటున్నారు మీరు? ఏరోగి దగ్గరకు వెళ్ళక పోయినా వాళ్ళ కెంతో కోపం వస్తుంది. ప్రియముఖర్జీ చేతి మాత్ర ఒకటి పడక పోతే ఏ రోగి అయినా ఎలా బ్రతుకుతాడు? ఈ భయం కేవలం అబద్ధమనికాదు— నేను చెప్పేది! ప్రియముఖర్జీ ఒక్కడే— కాని ఇద్దరు లేరు. నందమిత్ర ఏకో కొద్దో గొప్పో ప్రాక్టీస్ చేస్తూనే ఉన్నాడనుకో — నాలుగయిదు మందుల పేర్లు ఎరక్కపోలే దతడయినా — కాని అతనెందుకూ పనికి రాడు. ముఖర్జీ లేకపోతే పనిసాగదు. నేను వాళ్ళతో ఏమని చెప్పటం? ఒక మందు తాలూకు స్వభావం ఎవడన్నా జ్ఞాపకం పెట్టుకున్నంత మాత్రాన అవుతుందా? అరె! అంత సులభ విద్య కాదు; అంత సులభం కాదు. అలా అయితే అంతా డాక్టర్లయే వాళ్లు. అందరూ ప్రియముఖర్జీలే అయ్యే వారు!"

"నాన్నా! ఆకోటూ, చొక్కా విప్పరాదూ?"

"విప్పుతానమ్మా! ఇది మామూలు విషయమేగా!— 'పల్సెటిలా' ఇచ్చేశాను—ప్రాక్టీసయితే చేస్తున్నావుగా ఆ ముందు 'యాక్షన్' ఎలా ఉంటుందో కాస్త చెప్పు చూస్తాను! నాలాగా కంఠస్థం చేయకపోతే ఎలా చెబుతావు? సంధ్యా! కొంచెం పుస్తకం తెరిచిచూడు 'పల్సెటిలా'—

పుస్తకం తెరవటమెందుకు నాన్నా! ఇవాళ భోజన మయ్యాక ఆ మందును గురించి నీదగ్గర పాఠం చదువు కుంటా. పాఠం చెబుతావా, నాన్నా!"

ఎందుకు చెప్పను? తప్పకుండా చెబుతా 'నక్స వామికా' దీనికి అసలు భేదం ఉంది-ఆ పుస్తకం ఒకసారి తీసుకురా——"

"అంతవరకు నీకాళ్ళకు నూనెరాయనా నాన్నా! చాలా ప్రొద్దుపోయింది. అమ్మవచ్చి మళ్ళీ కోపపడుతుంది." అంటూనే తల్లి స్నానంచేసి వస్తోందో, లేదో అని, సంధ్య ఒకసారి ఉద్విగ్నదృష్టితో అటువైపు చూసింది.

"అరె, కాస్సేపు ఆగకపోయావా అమ్మా! ఒకసారి చూస్తే ..."

"ఇవాళ ఎవరెవర్ని చూశావు నాన్నా! సరే, పంచా మల్లాహ్ బాబాని-"

"ఆ ముసలివాడా? వాడుచచ్చిపోతాడు, తప్పకుండా చచ్చిపోతాడు. నువ్వు చూసిరా సంధ్యా !ఆ పరాన్ చటర్జీ-ఆ దుర్మార్గుడిమీద కేసుపెట్టికాని విడిచిపెట్టను అతడ్ని. నేను వరోగిని చూసి వస్తానో, ఆ రోగిదగ్గరకే వెళ్ళి, ఏదో చేసి వస్తున్నాడు. ఎవ్వరూ ఒక్కరోజుకన్న ఎక్కువ నేనిచ్చిన మందు తినరంటే ఎంచేత? ఆ నీచుడి మూలంగా ఆ గాడిద ఆ దౌర్భాగ్యుడి మూలంగానే! అతడేంచేశాడో తెలుసా! పంచాబాబాకు నేనోమందు సెలెక్టుచేసి ఇచ్చిరాగానే వాడు వెళ్ళి, ఏదీ! ఏమిచ్చాడో చూస్తాను' అన్నాడు."

సంధ్య కోపంతో "తర్వాత?" అంది.

తండ్రి ఆంతకంటె-"ఒట్టి దుర్మార్గుడు. గడ గడా ఆ మందు అంతా త్రాగేసి, 'పాడుమందు ఇదుగో, అంతా తాగేశానేను. నామటుకు అతణ్ణి త్రాగమనండి. ఎలా

త్రాగుతాడో చూస్తాను' అని ఒక ఆముదం సీసా ఇచ్చి వచ్చాడు. వాళ్ళు- 'స్వామీ మీ మందు అంతా ఆయన ఒక్క గుక్కలో తాగేశాడు. ఆయన మందు మీరుకూడా తాగేట్లయితే, మీమందు మేము పుచ్చుకుంటాం లేకపోతే లేదు' అన్నారు" అన్నాడు.

సంధ్య భయంతో వ్యాకులపడి;- "అది నువ్వు త్రాగ లేదుకదా నాన్నా" అంది.

"లేదు- అదెందుకు త్రాగుతాను? కాని ఇంత సేపటి వరకు ఇల్లిల్లూ తిరిగి వచ్చినా, ఒక్కరోగి అయినా దొరకలా. నీతో చెబుతున్నానుగా సంధ్యా! షర్మాన్ మీద నేను తప్పకుండా కేసుపెడతా?"

క్షోభ, అభిమానాలమూలంగా సంధ్య నేత్రాల్లో అశ్రువులు జలజలలాడాయి. నిరీహుడైన తన తండ్రిని, ప్రపంచంలోనున్న అన్ని ఉపద్రవాలనుంచీ, ఆఘాతాలనుంచీ, పరిహాసాలనుంచీ, తప్పించటానికి ఆమె తన పదిచేతుల్ని చాపి చాటుకు తీసుకురావాలనుకుంటుందేమో - అని అనిపించింది- "నాన్నా, నువ్వు పరాయివాళ్ళ కోసం ఈ ఎండలో ఎందుకు తిరగటం? ఎంతోమంది మీమందు కోసం ఇంటి చుట్టూ తిరిగిపోతున్నారు." అంది.

ఈ మాట కొంచెం సత్యదూరమైనది. ఊళ్ళో బీద వాళ్లు కొందరు మందుకోసం వచ్చేమాట నిజమే. సంధ్య దగ్గర తీసుకుందామని కాని ఆమె తండ్రి దగ్గర తీసుకుందామని కాదు. కొన్ని చిన్న చిన్న వ్యాధులకు చికిత్సచేయటం ఆమె తండ్రి దగ్గర నేర్చుకుంది. ఆమె ఇచ్చిన మందు సాధా

రణంగా నిష్ఫలమవటం అంటూ ఉండదు. ఆమె గుమ్మను చూసి, రోగులు యముణ్ణిచూసినట్లు భయపడుతారు. అంచేత వాళ్ళు సావధానంగా ఆలోచించి చూసి, ముఖర్జీ మహాశయుని చేతిలో పడకుండా ఆతడు లేని సమయంలో మందు కోసం ఇంటికి వస్తూఉంటారు. ఈ సంగతి సంధ్యకూ తెలుసు. కాని తండ్రికోసమని అబద్ధం చెప్పటంలో ఆమె కభ్యంతరం లేకపోయింది.

తండ్రి ఒక్కసారిగా గడబిడపడి, "తిరిగిపోతున్నారా? ఎవరువాళ్లు? ఎవరి తాలూకువాళ్లు? వెళ్ళి యెంతసేపయింది? యేదారిని వెళ్ళారు? ఊరు పేరూ అన్నీ అడిగి తెలుసుకున్నావా?" అన్నారు.

సంధ్య లోపల్లోపల చాలా సిగ్గుపడి, "ఊరూ పేరూ మనకేం నాన్నా! ఈసారి మళ్ళీ వాళ్ళంతటవాళ్ళే వస్తారు." అన్నది.

"హుం, మీతో వేగలేకుండా ఉన్నాను బాబూ! పేరు అడిగితే ఏం మునిగిపోయింది? ఇప్పుడే ఒక్కసారి వెళ్ళి తిరిగివచ్చేసేవాణ్ణి. ఆలస్యమయితే జబ్బు యెక్కువవుతుంది. ఏమీ చెప్పి వెళ్ళలేదూ? ఒక్క మాత్రతో ఇప్పుడే వాళ్ళ జబ్బు నయంచేసేవాణ్ణి."

సంధ్య మొదలుకొంకా యేమీ మాట్లాడకుండా నూనె రాస్తూ కూర్చుంది.

"యెప్పుడు వస్తామనిచెప్పి వెళ్ళారు?" అని మళ్ళీ ప్రశ్నించాడు తండ్రి.

"బహుశా సాయంత్రం..."

"బహుశానా? యెంత పొరపాటు జరిగిపోయిందో చూడు. ఒకవేళ మళ్ళీ రారేమో! ఒసేయ్ సంధ్యా, విపినుడి దగ్గరకుపోయి పడరుకదా! ఆ దుర్మార్గుడు పరాన్ ఎప్పుడూ ఈ ఆలోచనమీదే ఉంటాడు. ఈలోగా ఈ సంగతి వాడి చెవిని పడదుకదా! కాదు బాబూ, ఇహ నేను సహించలేను. చేతిలో ఏవైనా శనగపప్పుల్లాంటివి పెట్టి అయినా ఆపకపోయినావా? అటుచేసి ఇటుచేసి ఒకగంటయినా ఉంచలేకపోయావా? అన్నీ చెప్పాలా? అన్నీ చూపించాలా? ఎవరు? ఎవరది? రామమయూ? లోపలకు రారాదూ? కుంటుతున్నావెందుకు చెప్పు?"

ఆదరపూర్వకమైన ఆతడి మధుర ఆహ్వానాన్ని విని నడివయస్సులో ఉన్న ఒక రైతు లోపలికి వచ్చి నుంచుని అతి నిస్పృహాస్వరంతో "లేదండి! ఏమీలేదు." అన్నాడు.

"ఏం లేదూ? విచిత్రమే! చక్కగా కుంటుతూ ఏం లేదంటావేం? హుఁ నూనె రాయటం కొంచెం ఆపు సంధ్యా, ఏం లేదూ? స్పష్టంగా 'ఆర్నికా' కేసు కనపడుతూంటేనే! కాదు కాదు, పరిహాసంకాదు రామమయ్! ఎక్కడో కాస్త చూపించు కాలు?"

కాలు చూపించు-అనగానే ఒకసారి జాలిగా రామమయ్ సంధ్యకేసి చూసి, పశ్చాత్, "అవునండీ! కాలు కాస్త మడతపడి పడ్డాను నిన్న," అన్నాడు.

ప్రియబాబు ఒకసారి కూతురికేసి చూసి నవ్వి, "చూచావా సంధ్యా! చూడగానే చెప్పేశాను ఆర్నికా

వ్యాధి అని ! నేను చూడగానే తెలుసుకుంటాను. హూఁ ఎలా పడ్డావ్ ?" అన్నాడు.

'కాలు మడతపడి' అని చెప్పాను కదండీ! మా ఇంటి దర్వాజా ప్రక్కనే ఒకచిన్న నీళ్ళగుంట ఉంది. దాని మీదవుండే బల్ల కుర్రవాళ్ళు ఎక్కడో లాగిపారేశారు. పరధ్యానంగా ఉండి, నేను–"

"పరధ్యానమా ? ఎగ్నిస్ – ఎపిస్ ! సంధ్యా, జ్ఞాపకముంచుకో. స్వభావమే అసలు ప్రధానం. హేరింగ్ మహాత్ముడేం చెప్పాడంటే – హూఁ పరధ్యానం ఉండి– తర్వాత?"

"కాలుపెట్టాను లోపల, మడతపడి – కీలు..."

"ఆగు, ఆగు, ఇప్పుడేగా కాలు మడతపడిందన్నావు! మళ్ళీ కీలు తప్పిందన్నావు. కీలు తప్పటమూ, మెలికపడటమూ ఒకటికావు రామూ !"

"కాదండి అదే కాలు మెలికపడి కిందపడ్డాను"

"హూఁ పరధ్యానం, జ్ఞాపకం ఉండదు. ఇప్పుడే చెప్పటం, ఇప్పుడే మరిచిపోవటం. ఎగ్నిస్ – ఎపిస్, హుఁ, తర్వాత ?"

"ఆ తర్వాత ఇంకా ఏముంది బాబుగారూ ? నిన్నటినుంచీ నొప్పిమూలంగా కాలు కదల్చలేకుండా ఉన్నాను."

అని అతడు ఉత్సుకదృష్టితో సంధ్య ముఖంకేసి చూసి నిట్టూర్పు విడిచాడు.

సంధ్య గబగబా – "వేళ మించిపోతోంది నాన్నా ! కొంచెం ఆర్సికా" అనేసింది.

"ఆఁ, కొంచెం ఆగు సంధ్యా! కేసు స్టడీ చెయ్యానీ! సిమిలియా, సిమిలిబస్. రెమిడీ సెలెక్టు చెయ్యడం అంటే కుర్రవాళ్ళ ఆటకాదు. చెమటేసు వస్తుంది. ఊఁ తర్వాత? నొప్పి ఎలా వుంటుందో చెప్పకపూస్తాను, రామమయూ?"

"చిత్తం, చాలనొప్పిగా ఉంది బాబుగారూ!"

"అదికాదు, అదికాదు. ఏ రకంనొప్పి -అని? ఘర్షణ వత్తా? మర్షణవత్తా? సూచీవిద్ధవత్తా? వృశ్చికదంశవత్తా? (లాగుతున్నట్లుందా? పీకుతున్నట్లుందా? సూదులు గుచ్చుకున్నట్లుందా? తేలు కుట్టినట్లుందా?) కరకర నములుతున్నట్లుందా? భగభగ మండుతున్నట్లుందా?".

"చిత్తం, అవును బాబూ! సరిగ్గా అలాగే ఉంది."

"అయితే భగభగమంటోందా? సరిగ్గా అంతేనన్నమాట! తర్వాత"

"ఆ తర్వాత ఇంకేముంటుందని బాబూ? నిన్నటినుంచీ నొప్పితో చచ్చిపోతున్నాను"

"ఆగు. ఆగు. ఏమన్నావ్? చచ్చిపోతున్నావా?"

రామమయుడు అధీరుడై, "అంతకాక మరేమిటి ముఖర్జీమహాశయా? కాలు సరిగ్గా కింద పెట్టలేను. కుంటుతూ నడుస్తున్నా. చావుకాక మరేమిటి? అదీకాక ఆ కుర్రగుంటలు, దుడుకు వెధవలు. చెప్పినమాట వినరు. వద్దన్నా మానరు. ఆ బల్లతోటే అస్తమానమూ ఆటలు వాళ్ళకి. ఎప్పుడో ఓనాడు కాలుజారి అందులోపడి చచ్చిపోతానేమో అనిపిస్తోంది ఏదో ఒకమందు ఇవ్వండి మహాశయా, చాలా వేళయింది" అన్నాడు.

"నాన్నా ! ఆర్నికా రెండు చుక్కలు..."

ప్రియబాబు కుమార్తెకేసి చూసి కొంచెం నవ్వుతూ, "కాదమ్మా కాదు. ఇది ఆర్నికా కేసు కాదు. విపినుడైతే ఆ మందే ఇచ్చేవాడు నిశ్చయంగా. శ్రీహంద్రెక్ పోటెన్సీ ఎకోనైట్ నాలుగు చుక్కలు- రెండుగంటల కోసారి..." అన్నాడు.

సంధ్య కళ్ళు రెండూ పెద్దవిచేసుకుని "ఎకొనైటా నాన్నా ?" అంది.

"అవునమ్మా అవును. మృత్యుభయం! పడిచస్తానని భయం, సిమిలియా సిమిలిబస్ క్యూరెంటాల్. హేనింగ్ మహాత్ముడు రోగానికి కాదు-రోగికి చికిత్స చెయ్యాలోయ్- అని చెప్పాడు. మృత్యుభయానికి ఎకోనైటే ముఖ్యమైంది. విపినుడయితే - హుఁ, ప్రతివెధవా చికిత్స చేస్తానంటూ వచ్చేవాడే! రామమయ్యా! సీసా తీసుకుని మా అమ్మాయితో కూడా వెళ్ళు, రెండుగంటల కోసారికంతున నాలుగు సార్లు పుచ్చుకో. సాయంకాలం నేను వచ్చి చూసివస్తా. ముఖ్యమైనమాట. పరాన్ వచ్చాడంటే 'ఏం మందిచ్చావో ఏదీ, చూస్తాను' అంటాడు. ఖబడ్దార్! సీసామాత్రం బైటికితీయకు. ముందుగానే చెబుతున్నా. ఆ గాడిద బహుశా గడగటా అంతా త్రాగేసి, అందులో కాష్టక్ ఆయిల్ పోసిపెట్టి వెడతాడు- ఊఁ అబ్బ! కడుపులో మహా నొప్పిగా ఉంది."

రామమయ్యకి మందివ్వటానికి సంధ్య లేచినిలబడింది. భయంతో కంగారు పడతూ "ఆ అనుపమంతా నువ్వు త్రాగేసి రాలేదుకదా నాన్నా ?" అంది.

"ఊహుం. లేదు. చెంబు ఎక్కడే?"

"అయితే బహుశా నువ్వు–"

"లేదు, లేదు. చప్పున ఇయ్యి చెంబు. ఈ పాడు కొంపలో ఏ వస్తువూ దొరకదు సమయానికి. పోనీలే–అలాగే ఉండనీ చెంబు" అంటూనే ప్రియబాబు ఊర్ధ్వశ్వాసతో దొడ్డి తలుపు తీసుకొని బైటికి వెళ్ళిపోయాడు.

"చెల్లెలుగారూ, అయితే ఆమందు–" అన్నాడు రామమయుడు.

సంధ్య చకితురాలై "మందా? ఇదిగో, ఇప్పుడే తీసుకొస్తున్నా." అంది.

"అదే ఇప్పుడు మీరన్నారే–"ఆర్నిని" అనో ఏమిటో! అదే రెండు చుక్కలు ఇయ్యి తల్లీ! ముఖర్జీగారి మందు కాకుండా–"

సంధ్య లోలోపల బాధపడి, "నాకు నాన్నగారికన్న ఎక్కువ తెలుసా, రామమయ్?" అంది.

రామమయుడు సిగ్గుపడుతూ, "కాదు కాదు అది కాదు. అయినా ముఖర్జీగారి మందు చాలా ఘాటైమందుకదా తల్లీ! నేను బలహీనుణ్ణి, పైగా నేను వెళ్ళగానే మాదాయ్‌ని ఏదో విధంగా నచ్చచెప్పి పంపిస్తా. నిన్నటినుంచి అతడికి కడుపులో నొప్పి మొదలైంది. నాన్నగారి మందు ఇవ్వగానే అతడికి నయమైపోతుంది. నాకు మాత్రం మీరు చెప్పిన మందే ఇవాల్టికి ఇవ్వండమ్మా!" అన్నాడు.

సంధ్య విషణ్ణముఖంతో "సరే - ఇటునైపురా." అని రామయ్యుణ్ణి వెంటపెట్టుకుని, పక్కనున్న గది దగ్గరకు తీసుకెళ్ళింది.

జగద్ధాత్రి పూజామందిరంలోకి కావలసిన నీళ్ళు తీసుకు రావటానికి చెరువుకు వెళ్ళింది. ఇంట్లోకి వస్తూనే అరుగు మీద ఆ నీళ్ళబిందె "ధఫ్" మని కూలేసి క్రుద్ధస్వరంతో "సంధ్యా" అని కేకేసింది.

సంధ్య ఇంట్లోనుంచే "వస్తున్నానమ్మా!" అని జవా బిచ్చింది.

"మీనాన్న ఇంకా రాలేదుగా? అయితే ఠాకూర్ పూజ ఇవాల్టికి మానెయ్యాలిసిందే?" అన్నది తల్లి.

కుమార్తె గదిలోంచి ఇవతలికి వచ్చి "నాన్న వచ్చి చాలా సేపయిందమ్మా! నూనె రాసుకుని స్నానానికి వెళ్లారు." అన్నది.

"ఎక్కడికెళ్లారు? చెరువు దగ్గర కన్పించలేదే?"

అతడు ఎక్కడికెళ్ళాడో సంధ్యకు తెలుసు. కానీ నోరు మెదలకుండా ఊరుకుని, "అయితే ఇవాళ బహుశా నదికి వెళ్ళి ఉంటారమ్మా! చాలాసేపయింది- వస్తూఉంటారేమో!" అంది.

జగద్ధాత్రి ఏమాత్రం శాంతించలా. పైగా అతి ఉద్రిక్తమైన స్వరంతో, "ఇంక ఈయన్ని పెట్టుకుని నేను ఉండ లేనే సంధ్యా! వారైనా ఎక్కడికన్నా వెళ్ళిపోవాలి, లేదా నేనయినా ఎక్కడికన్నా వెళ్ళిపోతా. 'ఇవాళ భట్టాచార్యులు

గారు పూజకు రారు, మీరు కొంచెం పెందరాళే రండి' అని ఎన్నిసార్లు చెప్పా. అయినా ఇదేవేళకి రావటం! దేముడి నెత్తిన ఇన్ని నీళ్ళ చుక్కలయినా పడలేదుకదా!—అది అలా ఉండగా నిన్నరాత్రి ఏం చేసుకొచ్చారో తెలుసా? విరాట్ పరామణి ఇవ్వవలసిన డబ్బు వడ్డీతో సహా అంతా వదిలేసి, ముట్టినట్లు రసీదు ఇచ్చి వచ్చారు." అన్నది.

సంధ్య అతిసందేహంతో - "ఎవరు చెప్పారమ్మా!" అని అడిగింది.

"ఎవరేమిటి? ఆ పరామణి చెల్లెలే ఇందాక చెరువుకు స్నానానికి వచ్చి చెప్పింది."

సంధ్య కొంచెం నవ్వటానికి ప్రయత్నించి, "వాళ్ళు అన్నాచెల్లెళ్ళకి విరోధమమ్మా! బహుశా ఆమాట నిజమై ఉండదు." అంది.

జగద్ధాత్రి కోపగించుకుని, "నువ్వు అన్నిసంగతులూ దాస్తావెందుకు చెప్పు సంధ్యా? జ్వరం వచ్చిందని చెప్పి ఆ విరాట్‌గాడు పిలుచుకువెళ్ళాడు. మందు తీసుకున్నాడు. మీరు ధన్వంతరిలాంటివారండీ అని- కాళ్ళకిదణ్ణం పెట్టాడు. జమీందారులని ఉబ్బించాడు. చివరికిలా డబ్బుపోతేపోనీ, కాని ఇహ ఇంటికి తిరిగి వెళ్ళాల్సిన పనిలేదు - ఈబిందె పమిటకొంగుతో మెడకు కట్టుకుని చెరువులో మునిగి చచ్చిపోదామనిపించింది. ఈమధ్య మరీ కాల్చుకుతింటున్నారు సంధ్యా! నే నీ సంసారం ఎలా నిర్వహించటమో చెప్పు?" అన్నది.

"ఎన్ని రూపాయలమ్మా?"

"ఏనాడైనా! పదిపన్నెండు రూపాయలకు తక్కువ ఉండవు. గుప్పెడు రూపాయలు ఇలా ఇష్టం వచ్చినట్లు——"

ఆమెమాట ఇంకా పూర్తికానేలేదు. ఇంతలో ప్రియబాబు తడిగుడ్డలతో హడావుడిగా ఇంట్లోకి వచ్చి బిగ్గరగా—"సంధ్యా! అంగాస్త్రం! అంగాస్త్ర! అంగాస్త్రం ఒకసారి ఇలాఇయ్యి అమ్మా! ఎకోనైట్ త్రీహండ్రెడ్ పొట్లాలు—పెట్టెలో సరిగ్గా మూల——" అంటున్నాడు.

జగద్ధాత్రి అగ్నిజ్వాలలాగా ఝుయ్‌మంటూ లేచి, "ఎకోనైటంతా పారేశాను నేను. మామగారి తిండితో జమీందారులా• హోషు వెలగబెట్టటానికి సిగ్గులేదు మీకు? మంగలి విరాట్‌గాడికి వడ్డీ తీసెయ్యమని ఎవరు చెప్పారు మీకు? ఎవరి చోటులో మీరు యూనానివాళ్ళను, ఎలికల వాళ్ళను కాపరముంచారు? ఎవరి పొలాన్ని మీరు 'గోచర' అని దానమిచ్చి వచ్చారు? మొదటినుంచీ మీరు నా ఎముకలు కొరుక్కుతింటున్నారు. ఇవాళ నేనయినా ఇంట్లోంచి వెళ్ళిపోవాలి; లేదా మీరయినా వెళ్ళిపోవాలి" అంది.

సంధ్య తీవ్రకంఠంతో "రెండు ఝాములప్పుడు ఈ మాటలన్నీ ఎందుకు మొదలెట్టావో చెప్పు?" అంది.

తల్లికూడా అలా ధూకుడుగానే చెప్పింది, జవాబు "దీనికింక మధ్యాహ్నమేమిటి; ప్రొద్దున్నేమిటి? ఆయన నాకెవరే? దేవతాపూజ కాగానే నాలుగు మెతుకులుతినటం ఇంట్లోంచి వెళ్ళిపోవటమూనాయె? నేను చాలా రోజులు సహించాను. ఇక సహించలేను, సహించలేను." ఇలా

అంటూనే ఆమె హఠాత్తుగా ఏడవటం మొదలెట్టి ఇంట్లోకి వెళ్ళిపోయింది.

"హూఁ"అని ప్రియబాబు ఒక దీర్ఘ నిశ్వాసం విడిచి, " 'జమీందారునా నేను, ఇన్ని రూపాయలు డొక్క తీసెయ్యటానికి విరాట్?' అని నేనూ అన్నా. మీరేమిటి అంటున్నారు? ఎవరిమాట ఎవరు వినిపించుకుంటారు? అదీగాక వాళ్ళను మాత్రం ఎలా తప్పుపడతాను. మందు పుచ్చుకుంటే పథ్యం పుచ్చుకునేందుకు తిండానా లేకపోయె! నేత్రమ్ టు హండ్రెడ్ పౌండ్స్ ఒక్క చుక్క-చొప్పున-"

సంధ్య కళ్ళవెంబడి నీళ్ళు జలజలా రాలాయి. ఆమె వాటిని కన్పడనీయకుండా పమిటకొంగుతో తుడుచుకుని, "నాన్నా! అమ్మకి తెలియకుండా ఎందుకు నువ్వు ఈ చిక్కుల్లోపడతావ్?" అన్నది.

"నేను చెబుతున్నానుగా! పడను, కాని ప్రియముఖర్జీ లేకపోతే ఈ వూళ్ళో ఏమాత్రం సాగదు- అదీ చూస్తూనే ఉన్నా. ఎవళ్ళకెక్కడ జబ్బుగాఉందో- ఎవరికెక్కడ——"

అతను చెప్పతలచుకున్నది పూర్తి కానీయకుండానే సంధ్య వెళ్ళి వెంటనే ఆరేసినబట్ట, గావంచా తీసుకువచ్చి ఇచ్చి "ఇంక ఆలస్యంచెయ్యకు నాన్నా" అని ఆమె తన గదిలోకి వెళ్ళిపోయింది.

ప్రియబాబుకూడా తల తుడుచుకుంటూ, తుడుచు కుంటూ, పూజా గృహంలోకి వెళ్ళాలనే బయలు దేరాడు కాబోలు! "ఉస్! అబ్బా! కడుపులో నొప్పి నులిమేస్తోంది! పరాన్ పేరుతో-" అనుకుంటూ వెళ్ళాడు.

3

ఆరోజున రాసమణి- ఏ గోలోక ఛటర్జీ మహాశయుని పేరు చెబితే పులులూ మేకలూ ఒక్క రేవులో ఒక్క చోట నీళ్ళు తాగుతాయని, సంధ్యానుమాటిమాటికీ భయపెట్టిందో. ఆ హిందూ కుల చూడామణి, ఆ పౌరుషశాలి ఇప్పుడు వీధి సావిట్లోకి వచ్చి కూర్చున్నాడు. ఆయన కట్టుకున్న పట్టుబట్ట, జుట్టుముడిలో పెట్టుకున్న మందారపువ్వు చూస్తే- ఇంతకు మునుపే ఆయనకు ప్రాతఃకాలపూజా పునస్కారాలు- అన్నీ పూర్తి అయినాయని తోస్తుంది. బైటజనం ఇంకా ఎవళ్లూ రాలేదు. నౌకరు వచ్చి హుక్కాలో గుండా గుట్టావేసి సిద్ధంగా ఉంచి వెళ్ళాడు. ఆయన పరిచివున్న తివాసీమీద కూర్చుని బాలీసుకు చేరగిలపడి, పరధ్యానంగా హుక్కా పీల్చబోతుండగా లోపలనుంచి తలుపుగొళ్ళెం కదిలించిన చప్పుడు చెవినపడి, కళ్లెత్తి "యెవరు?" అని ప్రశ్నించాడు. లోపలినుంచి- "నేను- కాస్తయినా ఫలహారం అదీ తీసుకోకుండానే అప్పుడే సావిట్లోకి వెళ్ళారేం మహా! కోపం రాలేదు కదా?" అని జవాబు వచ్చింది.

"కోపమా? ఇంక కోపతాపాలు ఎవరిమీద చూపించను చెప్పు? అవన్నీ మీ అక్కతో కూడానే పోయాయి." అని దీర్ఘంగా నిట్టూర్చి, "ఉహూఁ. ఇంక ఇప్పుడేమీ పుచ్చుకోను. ఇవాళ గోకుల భగవాన్ అంతర్హితుడైన రోజు. కనుక సాయంకాలమే ఇంక సంధ్యాదికాలు నిర్వర్తించుకుని కాసిని పాలూ ఇంత గంగాజలం పుచ్చుకుంటాను. ఇలాగే

వెళ్ళిపోతాయి, ఈ కాసినిరోజులూ" అని మళ్ళీ మహోత్సాహె దీర్ఘంగా నిట్టూర్చి, హుక్కా గొట్టం పెదిమలకు తాకించాడు.

చాటున నుంచుని మాట్లాడుతున్న ఆమె గుమ్మం లోంచి తొంగిచూచి. సావిట్లోకి ఇంకా ఎవరూ రాకపోవటం గమనించి, మెల్లిగా ఇవతలికి వచ్చింది.

ఆమె విధవ, చూపులకు అందవికారంగా ఏమీ ఉండదు. ఇరవైనాలుగు, ఇరవైఅయిదేళ్ళ లోపుగా ఉంటుంది. వయస్సు. సన్నటి ఉల్లిపొరలాంటి పంచె కట్టుకుని ఉంది. చేతులకు అలంకారాలేవీ లేవు మెళ్లోమాత్రం రక్షా కవచంతో ఉన్న ఒక్కపేట బంగారపు • గొలుసువుంది. ఆమె చిరునవ్వునవ్వి, "మీరిలా పరిహాసాలాడితే లోకులే మనుకుంటారు చెప్పండి! అదీగాక ఇంక నేను తిరిగి వెళ్ళిపో వద్దూ!" అని మరుక్షణంలోనే ముఖం విచారసూచకంగా పెట్టి, "ఎవరి కుపకారం చెయ్యాలని వచ్చానో, ఆమె కాస్తా చటుక్కున వెళ్ళిపోయిందికదా! ఇప్పుడింక వెళ్ళి ముసలి అత్త మామలను కనిపెట్టుకుని ఉండాలా; అక్కర్లేదా? మీరే చెప్పండి" అంది.

గోలోకచటర్జీ హుక్కా పీలుస్తూ పీలుస్తూ అంతలో గాంభీర్యం తెచ్చుకుని "ఆమాటనిజమే! నాసంసారం అచం చలంగా ఉండాలనిచెప్పి మరో ఇంటివారమ్మాయిని పట్టుకుని ఉంచలేను. అలాకాకపోతే ఇంటికి శ్రీ మహాలక్ష్మి ఈ వయ స్సులో వదిలిపెట్టి ఎందుకు వెళ్ళిపోతుంది? మధుసూదనా! . సరే, అయితే ఏదో ఓమంచిరోజు చూసుకుని వెళ్లు. అక్క గారికి సేవచేయ్యాలని వచ్చావు. సేవచేశావు; వెళ్ళిపోతు

న్నావు నిజమే. ఇది ఊరికంతటికీ దృష్టాంతంగా ఉండి పోతుంది" అన్నాడు.

జ్ఞానదా మాట్లాడలేదు. గోలోకచటర్జీ ధోవతి అంచుతో కన్నీళ్ళు తుడుచుకుని, ఒక్కనిమిషం మాట్లాడకుండా హుక్కాపీల్చి గాఢస్వరంతో-"మహాలక్ష్మి! ఆమెకు రోజులునిండాయి, వెళ్ళిపోయింది. అందుకు దుఃఖించను కాని, సంసారంగుట్టు చెడింది. ఆడపిల్లలంతా పెద్దవాళ్ళయ్యారు. వాళ్ళు వాళ్ళవాళ్ళ అత్తవారిళ్ళకెళ్ళి- భర్తలతో సంసారం దిద్దుకుంటున్నారు. వాళ్ళను గురించి బెంగేమీ లేదు. కాని కుర్రవాడున్నాడు, వాడు పాడైపోతాడు" అన్నాడు.

జ్ఞానదా ఆర్ద్రకంఠంతో - "అలాంటి దౌర్భాగ్యం రాకూడదు. మీరిలాంటిమాటలన్నీ తలపెడతారెందుకు?" అంది.

ఆయన కొంచెం తలఎత్తి మ్లానంగా నవ్వి, "తల పెట్టకపోవటమే మంచిది. కాని అంతా కళ్ళకు కట్టినట్లు స్పష్టంగా కన్పిస్తూనే ఉందికదా! మధుసూదనా! నువ్వే సత్యం! సంసారంమీద మనస్సులేదు. వ్యవహార విషయాలన్నీ విషతుల్యాలయిపోయాయి. ఇంక బ్రతికినన్నాళ్ళూ - ఉపవాసాలతోనూ, నీ నామస్మరణతోనే గడిపేస్తాం! అందుకు బెంగలేదు, గుప్పెడు మెతుకులు ఒకపూట దొరికినా సరే సరి! దొరకకపోయినా వచ్చేనష్టమేమీలేదు. కాని ఆ కుర్రవాణ్ణి గురించే ఆఖరికి దిగులు-మధుసూదనా! నువ్వే దిక్కు!" అన్నాడు.

జ్ఞానదా కళ్ళవెంబడి నీళ్ళు జలజలరాలాయి. గోలోక ఛటర్జీ భార్య ఆమెకు వరసకి అక్క అయినా స్వంత చెల్లిలిలాగానే ప్రేమించేది. అంచేత ఆమె మరీ జబ్బులో ఉండగా జ్ఞానదాను తలుచుకునే సరికి, ఆమె రాలేకుండా ఉండలేక పోయింది. ఆ అక్క నెల్లాళ్ళ క్రితం ఇహంలోకంనుంచి వెళ్ళిపోయేముందు, ఈమె చేతిలో తన పదేళ్ళకొడుకును అప్పగించి పోయింది.

ఆమె కరుణస్వరంతో "కాని నేనయినా శాశ్వతంగా ఇక్కడ ఉండిపోలేను ఛటర్జీ మహాశయా ? లోకులేమంటారు చెప్పండి ?" అన్నది.

ఆయన కళ్ళు రెండూ పెద్దవిచేసి, "లోకులు నిన్న అంటారా ? అని ఈ ఊళ్ళో ఉంటారా ?" అన్నాడు. ఇంతకన్న ఎక్కువగా ఆయన నోటినుంచి మరోమాట రాలేదు. రావాల్సిన అవసరమూ లేదు.

జ్ఞానదాకూ తెలుసు ఈ సంగతి, అంచేత ఆమె మెదలకుండా ఊరుకుంది.

ఛటర్జీ చెప్పటం మొదలెట్టాడు. "నా మాటకు ఎదురు చెప్పినవాడు మరెక్కడికైనా వెళ్ళి బ్రతకాల్సిందేకాని – ఈ ఊళ్ళో నిభాయించలేడు. అదో పెద్ద ఆలోచనకాదు. ఆలోచిస్తున్నదల్లా కుర్రవాడిని గురించే. ఆమెకు నువ్వంటే మహా అపేక్ష. అంచేతే తను చనిపోయేప్పుడు తన సంతానాన్ని నీ చేతుల్లోనే అప్పగించిపోయింది. ఏదీ నా చేతుల్లో అప్పగించి పోలేదేం ?"

జ్ఞానదా అతికష్టంమీద అశ్రువులను ఆపుకుని, "నా కన్నీ తెలుసు ఛటర్జీ మహాశయా ! కాని మా ముసిలి అత్త గారూ మామగారూ ఇంకా బ్రతికే ఉన్నారుగా ? నేను తప్ప వారికి మరోదిక్కు లేదు" అంది.

ఆయన నిర్లక్ష్యంగా "లేదు. దిక్కు లేదు ! నువ్వు మాత్రం ఎలా ? ముఖర్జీ బ్రతికి ఉన్నట్లయితే అదొకరొత్తు. కాని అతణ్ణి నువ్వు కంటితోనైనా చూడలా. పదమూడో ఏటే వితంతువివి అయ్యావు-" అని జవాబిచ్చాడు.

"వితంతువును అయితే అయ్యాను మహాశయా ! అత్త మామలు బ్రతికిఉన్నన్నాళ్ళూ నేను వారికి సేవ చెయ్యాలి సిందే!"

అతడు ఒక్కక్షణం నిశ్శబ్దంగా ఉండి, గంభీరంగా ఒక్కసారి నిట్టూర్చి, "అయితే వెళ్ళు- నన్ను సర్వనాశనం చేసి .. కాని ఒక్క విషయం ఆలోచించిచూడు చిన్నావిడా!" అన్నాడు.

జ్ఞానదా కోపగించి "మళ్ళీ చిన్నావిడా అంటున్నారు. చెప్పలేదూ, లోకులు మిమ్మల్ని వేళాకోళాలు పట్టిస్తారని ! పేరుపెట్టి పిలిస్తే యేం ?" అన్నది.

ఛటర్జీ ముఖం ఇంతచేసుకుని, "పట్టించనీలే, వేళాకో ళాలు చిన్నావిడా ! వేళాకోళాలకు వరసేగా ?" అన్నాడు.

జ్ఞానదా చటుక్కున నవ్వేసి, అంతలో మళ్ళీ గాంభీర్యం తెచ్చుకుని, "ఊహు, అలా పిల్లేను. మీరు ఎప్పుడూ నన్ను పేరుపెట్టే పిలిచేవారు - ఇప్పుడూ అలాగే పిలవండి" అన్నది.

"సరే, సరే, అలాగేలే" అని అంటూండగానే ఆయన ముఖం విషాదావృతమైపోయింది. పైకివస్తూన్న నిట్టూర్పును మెల్లిగా అణచుకుని, కొంతవరకు స్వగతంలో లాగా అను కోవటం మొదలెట్టాడు. "హృదయంలో రాత్రింబవళ్ళు భగ్గున మంటమండి పోతోంది. నాకింకా పరిహాసాలూ, వేళాకోళాలూనా! అయినా మధ్యమధ్య - పోనీ - చెప్ప కూడదులే, జీవితంలో ఎన్నడూ ఎవరికీ అసంతుష్టి కలిగిం చలా, ఇంత ఇవాళ కలిగిస్తానా? సంపదలు విషం, సంసారం విషం. నీ శ్రీచరణ సన్నిధికి ఎప్పుడు చేరుకుంటాను మధు సూధనా?"

జ్ఞానదా జలజల కన్నీళ్ళు కారుస్తూ నిశ్శబ్దంగాచూస్తూ ఊరుకుంది. ఛటర్జీ చెప్పటం ప్రారంభించాడు. "మళ్ళీ మంట మీద మరోమంట, దీనికితోడు పైగా పెళ్ళిసంబధాల ఉత్పాతం! వాళ్ళకంతా తెలుసు. ఏమీ దాచలేను. 'మీ మాటంటే గౌరవమే. కులీనులపిల్లకులాన్ని కులీనులే కాపా డాలనీ తెలుసు ఇప్పుడు దుఃఖ తాపాలవల్ల అకాలంలో అసమయంలో వెంట్రుకలు నెరసినమాటా నిజమే. కాని అయితేఏం నెరసిన తలేకదా! దీనితో మళ్ళీ పెళ్ళిచేసుకుని, మళ్ళీ మెడకోబంధం తగిలించుకోవటం బాగుంటుందా!' అన్నాను ఏం, నువ్వేచెప్పు చిన్నావిడా!"

జ్ఞానదా శుష్కంగా నవ్వి, "భలే - చేసుకోండి ఇంకో పెళ్ళి!" అన్నది.

"నీకు పిచ్చావేుం? మళ్ళీపెళ్ళా? లక్ష్మిలాగా నువ్వు ఇంట్లో ఉన్నావు - ఎన్నైనాచెప్పు, దిక్కులేని అప్పుడోడు

కును ఇలా వదిలిపెట్టి నువ్వు ఎలాగూ వెళ్ళలేవు ! చనిపోయే ప్పుడు నీ చేతిలో అప్పగించిపోయింది – ఆమెమాట ఎటూ నిలబెట్టాల్సిందే, నాకు మళ్ళీ – ఎవరూ ?"

నౌకరు లోపలకివచ్చి 'సుబేదార్‌గారు వచ్చారు' అని చెప్పాడు.

గోలోకచటర్జీ ముఖం వికారంగా పెట్టి, "అబ్బ ! నా వల్ల కాదు. వ్యవహారాలు ! వ్యవహారాలు ! ఎప్పుడూ పనులే ! ఇవన్నీ నాకోమూల విషప్రాయాలై పోయాయని ఎవరికని తెలియచెప్పేది! ఎవరు తెలుసుకుంటారు ! మధుసూదనా ! ఎప్పుడు దాటిస్తావో కదా ! నుంచున్నావేం ? రమ్మని చెప్పరా !" అన్నాడు.

నౌకరు వెళ్ళిపోగానే జ్ఞానదా కూడా మరోవైపునుంచి లోపలికి వెళ్ళి గుమ్మంచాటున నుంచుని, "అయితే ఇవాళ నిజంగా ఏమీ పుచ్చుకోనక్లేనా ?" అని అడిగింది.

ఆయన తలతిప్పుతూ "ఊహూఁ. గోకుల భగవానుడు అంతర్థానమైనరోజు ఇవాళ – పర్వదినం. చిన్నావిడా ఇంకా మాలాంటివాళ్ళం ఇలాంటి నియమాలను అనుష్ఠిస్తున్నాం కనకనే ఆకాశంలో సూర్యచంద్రులు నిలబడి ఉన్నారు. సముద్రంలో పోటూ పాటూ కన్పిస్తున్నాయి. మధుసూదనా ! సర్వమూ నీ యిచ్ఛ !" అన్నాడు.

"పర్వదినం అయితే అయిందిలెండి. కాసిని పాలు – గంగాజలం పుచ్చుకుంటే తప్పులేదు. త్వరగా రండి. నేను కనిపెట్టుకు కూర్చుంటా" అన్నది జ్ఞానదా.

ఎదరగుమ్మంలోంచి నౌకరు, వాడి వెనకాలే మరొక పెద్దమనిషీ లోపలకు వచ్చారు. ఛటర్జీ ఆయన్ని ఆహ్వానిస్తూ, "రావోయ్ మణేదార్, వచ్చికూర్చో, బెంగపెట్టుకుని ఇదవుతున్నా, - కాస్త కబురైనా చెయ్యకూడదూ! భోలూ, నువ్వెళ్ళి ఆహుక్కాలో గుండా గుట్రా వేసి తీసుకొచ్చి ఇయ్యి ఇతడికి" అన్నాడు.

విష్ణుమణేదార్ ఛటర్జీకి నమస్కరించి, ఆయన పాద ధూళి శిరస్సున ధరించి, తివాచీమీద ఒకమూల కూర్చుని, దీర్ఘంగా నిట్టూర్చి "ఊపిరి పీల్చుకునేందుకు తీరిక ఉండటం లేదు బాబూ! మీరు ఇంకా కబురు - అంటారేమిటి? సరే - అయిదువందలూ, మూడువందలూ - మొత్తం ఎనిమిది వందలూ ఓడలో ఎక్కించే మరీ వచ్చాను. అబ్బ! ఎంత హంగామా!" అన్నాడు.

దక్షిణాఫ్రికాకు మేకలను, గొర్రెలనూ ఎగుమతి చేసే రహస్య వ్యాపారంలో ఈ విష్ణుమణేదార్ ఆయనను భాగస్వామి. మూడు మాసాలలోపల మూడువేల పశువులను పంపే షరతుతో కంట్రాక్టు వ్రాసుకున్నారు. అంచేత ఈ వర్తమానంతో ఛటర్జీ ప్రసన్నుడు కాలేదు. అప్రసన్న ముఖంతో "మొత్తం ఎనిమిది వందలా? కంట్రాక్టు ఏమో మూడువేలకు - ఇంకా చాలా బాకీ ఉంటుందే!" అన్నాడు.

మణేదారు రవంత కించపడి, "మేకలూ, గొర్రెలూ ఇంకా దొరుకుతాయనుకున్నారా పెదబాబూ! అన్నీ ఎగుమతే! అన్నీ ఎగుమతే! ఈ ఎనిమిది వందలూ పోగు చేసే సరికే తలప్రాణం తోకకు వచ్చింది. అయినా హరీంద్రుడు

వారం పదిరోజులు రైల్లో మరో అయిదారువందలు పంపు తానని రాంపూరునుంచి ఉత్తరం రాశాడు - రైల్లోంచి ఊరికే అలా దింపటం - ఇలా ఓసి ఎక్కించేసెయ్యటం. ఇంకా మూడు మాసాలు వ్యవధానం ఉంది. ఆ నారాయణ మూర్తి ఇచ్ఛవల్ల అయిపోతుందిలెండి" అన్నాడు.

ఛటర్జీ కొంచెం కుదుటపడి, "మీమీద నే భరోసా. నేను ఇప్పుడొక విధంగా గృహస్థ-సన్యాసిని అనుకోవచ్చు. మీ వదినగారు పోయిన దగ్గర్నుంచీ, డబ్బనాన్న - ఆస్తి అన్నా, నాకు విష్రప్రాయమైపోయాయి. కేవలం ఈ కుర్ర వాడికోసం. అయితే రూపాయకి రూపాయి వస్తుందని తోస్తోందా; లేదా ?" అన్నాడు.

మణేదారు తలతిప్పుతూ "ఓ, నిశ్చయంగా వస్తుంది. కాని ఈసారి డబ్బు అహమ్మద్‌సాహేబ్ కొట్టేస్తాడు. ఏడు వందలకు కంట్రాక్టు సంపాదించాడు. ఇంకా ఎక్కువ వచ్చేదే - కాని ధనాభావంవల్ల సాహసించలేకపోయాడు" అన్నాడు.

ఛటర్జీ కళ్ళతో సంజ్ఞచేస్తూ "చాలా కాచావా ఏం ?" అన్నాడు.

"లేకపోతే నేను వదిలేస్తానా బాబూ ?" అన్నాడు మణేదారు.

ఛటర్జీ ముక్కుమీద వేలేసుకుని "దుర్గా ! దుర్గా ! రామరామ ! ప్రొద్దున్నే అలాంటి మాటలంటావేమిటి మణే దార్ ! జాతికి మ్లేచ్ఛుడు. ధర్మాధర్మజ్ఞానం లేదు. పదివేలు లాభం సంపాయించేట్టున్నాడు- ఏం!" అన్నాడు.

"ఇంకా ఎక్కువ! ఇంకా ఎక్కువ!"

"యుద్ధం ఇంకా చాలారోజులు సాగేట్లయితే — నునుపు తేలేట్లున్నాడు. అంతేకదూ!"

"నిస్సందేహంగా. కాని, ఇది వేలతో వ్యవహారం! ఒక్కసారి దొరకాలంటే కష్టం."

"కంట్రాక్టు చూపించి అప్పుతీసుకోవచ్చు, కష్టమేముంది?"

మణేదార్ తల ఊగిస్తూ —"అది నిజమే. కాని దొరకాలికదా! నాతో చెప్పాడు—" అన్నాడు.

ఆమాట విని ఛటర్జీ ఉత్సుకుడై "చెప్పాడా ఏం? వడ్డీ ఏమిస్తానంటాడు?" అని అడిగాడు.

"అణావడ్డీ ఎటూ ఇస్తాడు — బహుశా—"

'బహుశా'—అని చెప్పబోయే మాటను ఛటర్జీ చెప్పనీయలేదు. కోపం తెచ్చుకుని "ఒక్క అణానా? రూపాయికి రూపాయి లాభం సంపాయిస్తాడు—వడ్డీదగ్గరకు వచ్చేసరికి ఒక్క అణానా? అర్ధరూపాయి, పదణాలు అయితే ఒక్క సారి కనిపించమను." అన్నాడు.

మణేదారు కొంచెం ఆశ్చర్యపడి, "సాయిబుకు డబ్బు మీరే ఇస్తారా ఏమిటి? కాని ఈ సంగతి ఒకవేళ పదిమందికీ తెలిస్తే—" అన్నాడు.

ఛటర్జీ ఒక్కనిమిషంలో తనను తాను దిటవుపరచుకుని, శుష్కమైన చిరునవ్వు నవ్వి, "రాధామాధవ! నీకేమన్నా పిచ్చెమేమోయ్! వీలయితే అడ్డుపడనే పడతాను.

కాని ఈ విషయం నీకూ నాకూతప్ప ఎవరికీ తెలియకూడదు. కాని ఒక్క మాట- అప్పుతీసుకున్న తర్వాత అతడు తండ్రి శ్రాద్ధం చేసుకోనీ. భోగంవాళ్ళని తెచ్చి ఆడించుకోనీ, ఆవులనే ఎగుమతి చేసుకోనీ - దానితో ఈ పెద్దమనుషుల కేంపని ?" అని అతడి సమ్మతికోసం - ఒక్క క్షణం ఆగి - "అదికాదు సుబేదార్! ఊరికే మాటవరసకి అన్నాను. ఇంత ఆరాలు తీయటం మొదలెడితే ఈ పెద్దమనుషులకు జరగదు. కాని నన్ను చాలా కాలంనుంచి చూస్తున్నావు కదా ? బ్రాహ్మణ ఇంట పుట్టినవాడను ధర్మమార్గంలో వుంటూ భిక్షమెత్తుకున్నా మంచిదే. కాని అధర్మా నికిమాత్రం ఒక్క పైసా అయినా ఇవ్వకూడదు. కేవలం ఆ పరమాత్ముని పాదాలమీదనే చాలా కాలంనుంచి బుద్ధినిష్ఠకం చేసుకున్నా కనుకనే ఇప్పుడు అయిదు ఊళ్ళకు సభాపతి నయినాను. ఈనాడు ఒక్క మాటతో బ్రాహ్మణ్ణి శూద్రుణ్ణిగాను శూద్రుణ్ణి బ్రాహ్మణ్ణిగాను చేసెయ్యగలను. మధుసూదనా ! నీవేశరణ్యం ! ఆమధ్య జబ్బుచేసినప్పుడు డాక్టరు జయగోపాలువచ్చి 'మీరు సోడా పుచ్చుకోవాలి' అన్నాడు. అప్పుడు నేను 'డాక్టర్‌జీ, పుట్టింతర్వాత చావటం అనేది గొప్ప సంగతేమీ కాదు. కాని ఆమాటమాత్రం మళ్ళీ మరోసారి ఈ గోలోకఛటర్జీ చెవిని పడనీయవద్దు' అన్నా ! కేనారాముఛటర్జీ కొడుకుని, హరరామ్‌ఛటర్జీ మనుమణ్ని నేను — ఒక్క బిందువు పాదోదకంకోసం భాండార్‌హాటీ మహారాజుకూడా పల్లకీయిచ్చి మనుష్యులను పంపేవాడు" అన్నాడు.

మణేదారు మరోసారి నమస్కరించి, లేచి నుంచుని — "ఆ మాట ఎవరు కాదనగలరు చెప్పండి? అది ప్రపంచ మంతా ఎరిగున్న సంగతేగా?" అన్నాడు.

మణేదారు వెళ్ళిపోబోతుండగా ఆయన మళ్ళీ వెనక్కి పిలిచి, "ఇంకో సంగతి, చూడు! హరీంద్రుడి దగ్గరనుండి రాగానే రైల్వే ప్యాసు నాకోసారి చూపించివెళ్ళు" అన్నాడు.

అతడు తలతిప్పుతూ "చిత్తం" అన్నాడు.

"అలా అయితే ఎనిమిది వందలూ, మరో ఐదు వందలూనా? పోతే ఇంక పదిహేడు వందలు బాకీ ఉంటుందన్న మాట. మూడుమాసాల టైం ఉంది. దొరుకుతాయిలే. ఏమంటావు?"

"చిత్తం. దొరక్కపోవట మేమిటి?"

"అంచేతనే నీ కప్పుడే చెప్పాను మణేదార్! ఒక్కసారే ఐదువేలకు కంట్రాక్టు వ్రాయించుకుని రమ్మన్నాను. అప్పుడు ధైర్యం చేయలేకపోయావు."

"చిత్తం, కాని అన్నిమేకలూ, గొర్రెలూ దొరక్కపోతే?"

ఛటర్జీ ప్రతివాదం చెయ్యలేదు. "అదే మంచిదిలే, అదే మంచిది. ధర్మపథంలో రూపాయికి సగం అయినా— నాలుగోవంతు దొరికినా అదేమంచిది. కాని అధర్మమార్గాన రూపాయకి మొహరీ దొరికినా మంచిదికాదు. తెలిసిందా, మణేదర్! మధుసూదన! నీవే గతి!" అన్నాడు.

మణేదార్ మరేమీ మాట్లాడకుండా వెళ్ళిపోగానే, భగవద్భక్తుడు, గృహస్థ సన్యాసీ అయిన ఛటర్జీ మహా

శయుడు విచారముఖంతో హుక్కా పీల్చసాగాడు. విషయ కర్మలన్నీ బహుశా ఆయనకి విషంలా కన్పిస్తూవుంటాయి - కాని ఇంతలో లోపలివైపు తలుపు తెరుచుకుని దాసీది ముఖం ఈవలకుపెట్టి "చిన్నమ్మగారు లోపలికి రమ్మంటున్నా రండీ!" అంది.

ఛటర్జీ త్రుళ్ళిపడి -"ఎందుకో చెప్పు సదూ!"అన్నాడు.

"కాసిని పాలూ వగైరా మీకోసం సిద్ధంచేసి కని పెట్టుకు కూర్చున్నారు" అన్నది.

ఛటర్జీ హుక్కాతీసి చిరునవ్వు నవ్వుతూ; "మీ చిన్నమ్మగారితో వేగలేకుండా వున్నానే సదూ! పర్వదినం, ఒకపూట ఉపవాసం చేద్దామనుకుంటే ఆమె సహించేట్టు లేదు" అని, ఆయన లేచి నిలబడి - వెళుతూ వెళుతూ నిట్టూర్పు విడిచి, "సంసారంలో ఉండి - పరలోకంలో ఉప యుక్తమయ్యే పనులు రెండు చేసుకుపోదామంటే ఎన్నైనా విఘ్నాలే! మధుసూదన! హరిహరీ!" అన్నాడు.

## ౪

కొన్నాళ్ళనుంచీ సంధ్యకు ఒంట్లో బాగుండటంలేదు. తరచు జ్వరం వస్తూనే ఉంది. తండ్రి చికిత్సలో ఉండి ఆమె క్రమక్రమంగా నీరసించిపోతోంది. తల్లి డాక్టర్ విపినబాబును పిలిపిస్తానని బెదిరిస్తూ ఉంటుంది. ఈ విషయంమీద తల్లీ కూతుళ్ళ ఇద్దరిమధ్యా ప్రతిరోజూ చిన్నచిన్న తగాదాలు ప్రారంభమవుతూనే ఉంటాయి. ఇవాళ సాయంకాలంపూట సంధ్య ముందరివసారాలో ఒక స్తంభానికి ఆనుకుని కూర్చుని,

తల్లి ఇచ్చిన సగ్గుబియ్యం జావ కళ్లుమూసుకుని ఎలాగో అలా త్రాగేసి, గబగబా ఒక తమలపాకు డోకు రాకుండా నోట్లో కుక్కుకుంది. ఈ సగ్గుబియ్యం జావంటే సంధ్యకు తగని డోకు. కాని త్రాగలేదు. కాస్తే త్రాగావు-ఇలా అంటే మాటమీద మాట అనటం ఆమెకు ఇష్టంలేదు. ఏ మూల నుంచో ఓ మూలనుంచి తల్లి తనని కనిపెట్టి చూస్తూనే ఉంటుందని ఆమెకు నిశ్చయంగా తెలుసు. ఇంతకుముందు ఆమె ఏదో పుస్తకం చదువుతోందల్లే ఉంది; ఆ పుస్తకం పేజీలు విప్పి ఆమెఒళ్లో బోర్లగా పెట్టిఉంది. ఆ పుస్తకమే మళ్ళీ తీసుకొని చదువుకోబోతుండగా ముందరివాకిట్లో ఒక వైపునుంచి, "పిన్నీ, ఎక్కడున్నావమ్మా!" అన్న పిలుపు వినిపించింది.

పిలుస్తూ లోపలికివచ్చాడు అరుణ్. అతడు కట్టుకున్న బట్టలు, అలసిపోయినట్లున్న అతడి ముఖం చూస్తే ఎక్కడి నుంచో వచ్చినట్లున్నాడు.

ఒక్క నిమిషంపాటు పాండు మలినమైన సంధ్య ముఖంలో రవంత రక్తిమ కనిపించింది. ఆమె కళ్లెత్తి నవ్వు ముఖంతో, "నువ్వు ఇప్పుడే కలకత్తానుంచి వస్తున్నట్లున్నావే అరుణదా!" అని అడిగింది.

అరుణ్ దగ్గిరకు వచ్చి ఆశ్చర్యపోతూ, "ఆఁ, కాని నువ్వు ఇంత చిక్కిపోయావెంచేత? మళ్ళీ జ్వరం వస్తోందా!" అన్నాడు.

"అలాటిదే ఏదో ఒకటి అయి ఉంటుంది. కాని నీ ముఖంకూడా కొంచెం వాడినట్లు కనుపిస్తోందేం!"

"ముఖం చేసుకున్న అపరాధమేముంది? రోజల్లా స్నానంలేదు — భోజనమూ లేదు. భలేమాదిరీలు పురమాయించావు. వెతికి వెతికి హైరానపడ్డాను. ఇదిగో తీసుకో" అని అతడు జేబులోంచి కొన్ని కాగితాలుతీసి సంధ్య చేతికిచ్చి, "పిన్ని ఎక్కడుంది? బాబయ్య బైటికి వెళ్లాడనుకుంటా. క్రిందటి శనివారం ఎంత ప్రయత్నించినా రాలేకపోయాను. అంచేత ఇది తీసుకురావటం ఆలస్యమైపోయింది. ఏమి అల్లుతావ్! పక్షుల బొమ్మలా; పువ్వుల బొమ్మలా? లేకపోతే దేముళ్ల బొమ్మలా?" అన్నాడు.

"ఆ ఆలోచనకు ఇంకా చాలా వ్యవధి ఉంది. వీటిని తీసుకురావటానికే వారంరోజులు పట్టినప్పుడు—వాటిని ఇవ్వటానికి మరోగంట ఓపికపట్టలేక పోయావా? స్టేషనునుంచి ఇంటికి వెళ్లకుండా సరాసరి ఇక్కడకే వచ్చేశావేం?"

అరుణ్ నవ్వుతూ, "స్నానం, భోజనం సంగతికా? అవి ఇంక 'సంధ్యా' నంతరమే. కాని చటుక్కున అంత అస్వస్థతలో పడ్డావేం. చెప్పవూ?" అన్నాడు.

అతడు మాట్లాడిన 'సంధ్య' అన్న మాటలోని వ్యంగ్యం సంధ్యచెవికి సోకి ఆమె ముఖాన్ని కొంచెం ఆరక్తంచేసింది. కాని అదేమీ గ్రహించనట్లే ఆమె కోపం తెచ్చుకుని, "అది అవటానికి (సంధ్యాసమయం) మాత్రం ఇంక ఆలస్యమేముంది అరుణదా! వెళ్ళు! ఇంక ఊరికే అనవసరంగా ఆలస్యం చెయ్యకు" అన్నది.

అరుణ్ మళ్ళీ సమాధానమేదో చెప్పబోయాడు. కాని జగద్ధాత్రి ముఖంకేసి చూసేసరికి అతడి పెదిమల్లో మాట పెదిమలచాటునే ఉండిపోయింది. ఆమె కోపంతో ముఖం కందగడ్డలా చేసుకుని, ఇంట్లోంచి బైటికివచ్చి, కూతుర్ని ఉద్దేశించి - "తమల పాకులింక నవలకే సంధ్యా, అది నోట్లోంచి ఉమ్మేసి తర్వాత నీ ఇష్టంవచ్చినట్లు పరిహాసాలాడు" అని ఎవరివైపూ చూడకుండానే గబగబా అక్కడి నుంచి వెళ్ళిపోయిందావిడ. హఠాత్తుగా ఏదో రభస జరిగినట్లయింది. అరుణ్ వజ్రాహతుడిలాగా నోట మాటలేకుండా అలాగే నిశ్చలంగా నిలబడిపోయాడు. సంధ్యముఖం వివర్ణమై పోయింది. కొన్ని క్షణాలపాటు సాంధ్యాకాశంలోని కాంతి అంతా మాయమయి పోయినట్లయింది. కాస్సేపలాగే ఉండి సంధ్య నోట్లో తమలపాకులు ఉమ్మేసి, చటుక్కున ఏడుపు ప్రారంభించి, "నువ్వు ఇంక ఈ ఇంటికి రావటం ఎందుకు అరుణదా! మమ్మల్ని సర్వనాశనం చేయుందే ఇంక నువ్వు విడిచిపెట్టవా ?" అంది.

మొదట్లో అరుణ్ ఒక్కమాటయినా మాట్లాడలేక పోయాడు. తర్వాత మెల్లిగా "నువ్వు నోట్లో తమలపాకు ఉమ్మేశావు - నేను నీకు నిజంగా అస్పృశ్యుణ్నా ?" అని మాత్రం అన్నాడు.

సంధ్య హఠాత్తుగా ఏడుస్తూ, "నీకు జాతిలేదు, ధర్మం లేదు - ఎందుకు ముట్టుకున్నావు నన్ను ?" అంది.

"నాకు జాతీ, ధర్మమూ లేవూ ?"

"ఊహూఁ లేదు. నువ్వు సీమకు వెళ్ళావు - మ్లేచ్ఛుడివి. ఆ రోజున మా అమ్మ నీకు ఇత్తడి చెంబుతో మంచినీళ్ళు ఇచ్చింది జ్ఞాపకంలేదూ ?"

అరుణ్ దీర్ఘనిశ్వాసం వదిలి "ఊహుఁ, నాకు జ్ఞాపకం లేదు. కాని నీ దగ్గిర నేనిప్పుడు అస్పృశ్యుణ్ణి, మ్లేచ్ఛుణ్ణి!" అన్నాడు.

సంధ్య కళ్ళు తుడుచుకుని, "కేవలం నాకే కాదు, అందరికీని. ఈనాటినుంచేగాదు; ఎవరి అభ్యంతరాన్నీ పాటించకుండా నువ్వు ఎప్పుడైతే సీమకెళ్ళావో - ఆనాటి నుంచీ..." అన్నది.

"కాని నే నేమనుకున్నానంటే-"

కాని మనస్సులో ఏమనుకున్నాడో మాత్రం చెప్పలేకపోయాడు. ఒక్క నిమిషం మాత్రం ఆగి, "నేను ఇంక బహుశా ఈ ఇంటికి రాను; కాని నన్ను నువ్వు అసహ్యించుకోకు. సంధ్యా! అసహ్యం కలిగేపనులు నేనెన్నడూ చెయ్యలా" అన్నాడు.

"నీకు ఆకలిదప్పిక లేమీ లేవా అరుణదా ? నువ్వు ఇలా నాతో జగడం పెట్టుకునే నుంచుంటావా ?"

"లేదు. నేను జగడమాడను. అసహ్యించుకునేవారి ముఖాముఖిని నుంచుని వివాదం పెట్టుకునేటంత అల్పుణ్ణికాదు నేను" అని అరుణ్ మెల్లిగా బైటికి వెళ్ళిపోయాడు. సంధ్య అటుకేసి రెప్పవాల్చకుండా చూస్తూ రాయిలాగా అలాగే కూర్చుండిపోయింది.

తల్లి ఎదుటికివచ్చి ప్రసన్నముఖంతో "వెళ్ళనీ, బహుశా ఇంక రాడనుకుంటాను." అంది.

సంధ్య తృళ్ళిపడి "రాడు" అంది.

"అనవసరంగా ముట్టుకున్నావు బట్టలువిడు" అన్నది తల్లి. సంధ్య తల్లిముఖం కేసి చూసి, "బట్టలుకూడా విడవాల్సిందే ?" అన్నది.

ఆమె మ్లానముఖం తాలూకు కవళిక తల్లికంట పడలేదు. ఆమె ఆశ్చర్యపడుతూ, "అక్కర్లేదూ ? కిరస్తానీవాడు —వితంతువైనా, పెళ్ళయినవాళ్ళయినా స్నానంకూడా చెయ్యాలి. ఆ రోజున రాసమణి పిన్ని— అం, కొంచెం బడాయి చూపిందిలే కాని ఆవిడదగ్గిర ఆచారవ్యవహారాలు నేర్చుకోవాల్సిందే. యానాదివాళ్ళపిల్ల తాకిందో—లేదో, అయినా మనుమరాలిని వేళ కానివేళ చెరువులో ముంచికాని ఇంట్లోకి తీసుకురాలా" అంది.

"సరేలే అమ్మా ! వెడుతున్నా" అన్నది సంధ్య.

తల్లి తల ఊగిస్తూ బ్రాహ్మల ఆచార వ్యవహారాల్ని గురించి ఇంకా ఏవో ఉపదేశం ఇవ్వబోయింది కాని, వెనకాలనుంచి "జగూ ఇంట్లో ఉన్నావా ?" అని పిలుపు వినిపించింది.

గోలోకచటర్జీ మహాశయుడు సరాసరి సాపిట్లోకి వచ్చేశాడు. జగద్ధాత్రి వెనక్కి తిరిగిచూసి, "ఓహో చటర్జీ మామే ! ఎంత అదృష్టం" అంది

కాని ఆ రోజున రాసమణి పిన్నికి, తన కూతురుకు జరిగిన సంఘటన జ్ఞాపకంవచ్చి జగద్ధాత్రి ముఖం ఎండిపోయింది.

సంధ్య లేచినుంచుంది. గోలోక ఛటర్జీ ఆమె మాటలకు సమాధానం చెప్పకుండా సంధ్యతో మాట్లాడటం ప్రారంభించాడు. నవ్వుతూ, "ఏమే సంధ్యా! ఎలా ఉన్నావు? కొంచెం జబ్బుగా ఉన్నట్లున్నావే!" అన్నాడు

"లేదు. బాగానే ఉన్నాను తాతయ్యా!"

జగద్ధాత్రి శుష్క ముఖంలోకి కొంచెం నవ్వు తెచ్చుకుని, "ఆఁ బాగానే ఉంది! నెల్లాళ్ళనుంచి మామా! రోజూ అస్వస్థతే, రోజూ జ్వరమే. ఇవాళకూడా సగ్గుబియ్యం జావ త్రాగి కూర్చుంది" అన్నది.

"అలాగా? అలా ఎందుకుండమా మరి! ఎక్కడో ఈపాటికి ఒళ్ళోపిల్లల్ని వేసుకుని సంసారం చక్కదిద్దుకుంటూ ఉండాల్సింది. మీరు దాన్ని ఇంట్లో కట్టేసి ఉంచారు. పెళ్ళి ఎప్పుడు చేస్తారు? వయస్సు—"

జగద్ధాత్రి చటుక్కున వయస్సు సంగతి పైకి రానీయకుండా "ఏంచెయ్యను మామా! నేను ఒక్కర్తెను — ఆడదాన్ని, ఎన్నని చక్కదిద్దుకోను. ఆయన వినిపించుకోనే వినిపించుకోరు. ఒకటే వైద్యం పిచ్చి. ఇవన్నీ వదిలేసి కాశీవెళ్ళి అత్తదగ్గర ఉండిపోదామా అన్నంత అసహ్యంపుట్టుకొస్తుంది. తర్వాత ఎవరికి ఎలా రాసిపెట్టి ఉంటే అలా అవుతుంది" అని చెబుతూండగనే ఆమె కంఠస్వరం గద్గదమైంది.

"ఆ పిచ్చివాడు ఏంచేస్తున్నాడిప్పుడు?"

"ఆయన పిచ్చివారైనా బ్రతికిపోదును— శుభ్రంగా గదిలో పడేసి తలుపుగొళ్ళెం పెట్టేదాన్ని... నన్ను లోపలా

బైటా అన్నివిధాలా కాల్చి మసిచేస్తున్నారు" అంటూ జగద్ధాత్రి పమిటచెంగుతో కళ్లు తుడుచుకుంది.

గోలోక ఛటర్జీ సానుభూతి స్వరంతో—"అవునవును, నేనూ చాలా సంగతులు విన్నాను. మీరుకూడా 'విల్లు విరిచేవాడే' రావాలని "పణం" పెట్టుకు కూర్చున్నారటగా! స్వయంగా కార్తికేయుడు కాని రాకపోతే కన్యను ఇవ్వర టగా! మనలాంటి మహాకులీనుల ఇళ్ళల్లో అలాంటి వెప్పు డయినా జరుగుతాయా, జరిగాయా అమ్మాయి? ఆ రోజుల్లో ఎంత కులీనులైతేమాత్రం గంగాస్నానం చెయ్యండే—వారి కులీనత దక్కేదా—వినలేదూ నువ్వు? మధుసూదనా నీవే సత్యం!" అన్నాడు.

జగద్ధాత్రి క్షుబ్ధురాలై "నీకెవరు చెప్పారు మామా! అల్లుడు మయూర వాహనంమీద వస్తేనేగాని పిల్ల నివ్వ నన్నామా! పిల్లముందా? కులంముందా? మా వంశంలో ఎవ్వరూ శూద్రులని చెప్పి కాయస్థుల ఇళ్ళల్లో కాళ్ళయినా కడగరే—నేను కార్తికేయుడే రావాలని కాంక్షిస్తానా? కులీనతలేని కొంపల్లోమాత్రం పడెయ్యను నా పిల్లను. కాళ్ళూ చేతులూ కట్టి గంగలోనైనా పారేస్తా... ఇదే నా ప్రతిజ్ఞ" అంది.

ఛటర్జీ సంతోషంతో "అదా సంగతి? సరే నేను చూస్తానులే" అన్నాడు.

వెడదాం- వెడదాం అనుకుంటూనే సంధ్య ఎర్రబడ్డ ముఖంతో తలవంచుకుని, అక్కడే నుంచుని ఉంది. ఛటర్జీ ఆమెవంక చూస్తూ హాస్యంగా, "కార్తికేయుడే రావాలను

పోతే-జగ్గూ, పిల్లను నా చేతుల్లోనే పెట్టరాదూ ? వరస కాదనే ఇబ్బందిలేదు. రాజా రాణీలా ఉంటాం చక్కగా. ఏమంటావు మనుమరాలా! పసందుగా ఉన్నానా?" అన్నాడు.

మరో సమయంలో కనుక అయినట్లయితే పరిహాసంలో సంధ్యకూడా భాగం పంచుకునేదే కాని, అరుణ్‌తో ప్రారంభమైన ప్రసంగం తండ్రిదాకా వచ్చేసరికి, ఆమె క్రోధంతోనూ, దుఃఖంతోనూ సిగ్గుతోనూ ఉడికిపోతోంది. అంచేత ముఖం పైకెత్తి కాఠిన్యంగా "పసందు ఎందుకుకాదు తాతా! సప్తకట్ల సవారీయెక్కి శ్మశానానికి వెడుతూ మీరీ దారినే వేంచేస్తే నేను పూలదండ కట్టుకు సిద్ధంగా ఇక్కడే నుంచుంటాను" అని గబగబా ఆమె మరో గుమ్మంలోంచి బైటికి వెళ్ళిపోయింది.

ఆమె పట్టరాని కోపంతో వెళ్ళిపోయిందన్న సంగతి స్పష్టంగా తెలుస్తూనే ఉంది. అనవసరమైన పరిహాసంవల్ల కలిగిన ఈ తీవ్రమైన నిందకు మొదట్లో ఛటర్జీకి నోటివెంట మాటరాకుండా పోయింది. తర్వాత 'హ! హ! హ!' అని శుష్కమైన నవ్వునవ్వి, "పిల్ల అంటే పిల్లకాదు. సీమనుంచి దిగిన షైల్మాక్! అదీకాక తాతా మనుమరాలి వరస అనొచ్చు. కాని ఆ రోజున రాసమణి చెబితే విన్నా - నోటికెంతమాటవస్తే అంతమాటా అనేస్తుంది - అని. తల్లితండ్రులన్నా లక్ష్యం చెయ్యదన్నమాట" అన్నాడు.

జగద్ధాత్రికి మొదటినుంచీ - ఇలా ఏం జరుగుతుందో అని భయంగానే ఉందికాని, మధ్యలో, పరిహాసంలో పడి ఇది కొట్టుకుపోతుందిలే-అని ఆశించింది. బహుశా కొట్టుకు

పోయేదే కాని, సంధ్య అనవసరంగా పుట్టలో వున్న పామును కర్రతో కదిపి బయటికి లాక్కువచ్చింది. కూతురిమీద ఆమెకు కలిగిన విరక్తికంతులేదు. కాని పైకిమాత్రం సవిన యంగా "లేదుమామా! సంధ్య అవేమీ అనలేదు. పిన్న కాస్త అయితే గంపంతచేసి చెబుతుందని నీకూ తెలుసుగా!" అంది.

"అది తెలుసు. కాని నా దగ్గర అలా చెప్పదు:"

"నేనప్పుడు అక్కడే నుంచుని ఉన్నాను మామా!"

ఛటర్జీ నవ్వుతూ– "అయితే మరీ బాగుంది. హద్దు పెట్టనన్నా పెట్టలేక పోయావన్నమాట" అన్నాడు.

ఈ నవ్వుతో జగద్ధాత్రి మనస్సులో కాస్త బలం తెచ్చుకుని "హద్దా? నువ్వు చూస్తూవుండు మామా! దాన్ని ఎలా శిక్షిస్తానో!" అన్నది.

ఛటర్జీ స్నిగ్ధస్వరంతో, "పోనీ శిక్షించాల్సినంత అవ సరంలేదు–పెళ్ళిఅయి సంసారం నెత్తినపడితే తననుతానే చక్కదిద్దుకుంటుంది. అయినా కాస్త అదుపులో ఉంచా ల్సిందే. రోజులు చూస్తే చాలా భయంగా ఉన్నాయి. అరుణ్ వస్తున్నాడా ఇప్పుడు?" అన్నాడు.

జగద్ధాత్రి భయంకొద్దీ, "అరుణ్! ఎప్పుడో రావటం లేదే" అని అబద్ధం ఆడేసింది.

"మంచిది. ఆకుర్రవెధవని రానీయకండి, వాణ్ణిగురించి రకరకాల మాటలు వింటున్నాను."

సంధ్య చిన్నప్పటినుంచీ అరుణ్‌ని అన్నయ్యా! అని పిలుస్తూ ఉండేది. అతడు సీమకు వెళ్ళకపూర్వం ఇద్దరిమధ్యా చాలా సుహృద్భావం ఉండేది. కాని అతడు బ్రాహ్మల్లోంచి వెలిఅయినాడు. కనక వీళ్ళ స్నేహం ఎన్నడైనా ఏవిధంగా నైనా పరిణమిస్తుందేమో! – అన్న సంశయం తల్లికి కల్లో నయినా లేశమాత్రంకూడా లేదు. కాని కొన్నాళ్లనుంచే సంధ్య ప్రవర్తనలోనూ సంభాషణలలోను మధ్యమధ్య ఆమె కొకవిధమైన మంటపుడుతోంది. కళ్ళుమూసుకున్నా ఆమె కా మంట కన్పిస్తూనే ఉంది. కాని ఎంతయినది అయినా ఈ విష యాన్ని పురస్కరించుకుని ఇంత ఉద్విగ్నురాలు కావలసినంత అవసరంలేదని ఆమెకు తెలుసు. కాని ఆ విషయాన్నే ఇప్పు డితరులవల్ల సూచనగా వినేసరికి ఆమె ధైర్యం ఆపుకోలేక పోయింది, "వింటే ఎన్నైనా వినవచ్చు మామా! కాని నా కూతురి విషయంలో లోకులకు ఇంత అక్కసు దేనికో!" అన్నది రిక్తకంఠంతో.

ఛటర్జీ చిరునవ్వు నవ్వి, గంభీరంగా—"అది నిజమే అమ్మాయీ! కాని తగిన సమయంలో జాగ్రత్త తీసుకోక పోతే లోకుల నోరు మూయలేము సుమా?" అన్నాను.

జగద్ధాత్రి దీనికికూడా ఏదో సమాధానం చెప్పబో యింది. కాని, సరిగ్గా ఈ సమయానికే సంధ్య అలా చేసి రావటం చూసేసరికి ఆమె భయంతోనూ, ఆశ్చర్యంతోనూ, విపరీతమైన కోపంతోనూ మాట్లాడలేకపోయింది. సంధ్య చెరువులో స్నానంచేసి ఇంట్లోకి వస్తోంది; ఆమె వంటిమీనున్నవి తడిగుడ్డలు, కేశభారం నుంచి నీళ్ళు కారుతున్నాయి.

ఇంకా తల తుడుచుకునేందుకు వీలుచిక్కలా. ఈ స్థితిలో ఆమె పక్కనుంచి తప్పుకుంటూ గబగబా తన గదిలోకి వెళ్ళిపోయింది.

"సంధ్యకు జ్వరమని చెప్పావుగా జగ్గూ! సాయంకాలంపూట స్నానంచేసి వస్తోం దేం!" అని అడిగాడు ఛటర్జీ.

"నాకు ఏం తెలుసు మామా?" అని జవాబిచ్చింది జగద్ధాత్రి. కాని ఆమెకు విరుద్ధంగా తాను అరుణ్‌కు అవమానం చేసినందుకు-ఇది పైకి చెప్పకుండా, కఠినంగా బదులు తీర్చుకోవటమని ఆమెకు మనస్సులో తెలుసు.

"ఇలాంటి కూడని పనులుచేస్తే రోగం మరింత పెచ్చు పెరగదూ?"

"పెరిగితే మాత్రం ఏం చెయ్యను మామా? అది నా చేతిలో లేదు."

ఛటర్జీ తల ఊపుతూ, "అదీ తెలుసుకున్నాను. సరే అయితే అడుగుతాను- ఇంతకీ ఈ ఇంటి యజమాని ఎవరు? నువ్వా; అల్లుడా? లేక నీ కూతురా?" అన్నాడు.

"అందరూ యజమానులే" అంది జగద్ధాత్రి.

"అయితే వారితోనే చెప్పు. ఊరి మధ్యకు తీసుకొచ్చి యానాదివాళ్ళనూ మెలికలవాళ్ళను ఉంచటానికి వీల్లేదు. వాళ్ళకేదో వేరే ఏర్పాటు చెయ్యకపోతే, నేనే చెయ్యాల్సి వస్తుంది. మధుసూదన! నీవేగతి!"

దానికి సమాధానంగా జగద్ధాత్రి కోపంతో "సంధ్యా! ఇలారా!" అని పిలిచింది.

సంధ్య లోపల తల తుడుచుకుంటోంది స్నల్లే ఉంది. కొంచెం ముఖం బైటికిపెట్టి "ఎందుకమ్మా?" అని అడిగింది.

"యానాదివాళ్ళను వెళ్ళగొడతావా? లేక రేపు స్నానం చేయబోయేముందు నేనే చీపురుకట్ట తీసుకుని బాది వెళ్ళగొట్టనా!" అంది.

"దిక్కులేని ఇద్దరు ఆడవాళ్ళను చీపురు తీసుకుని బాదటం ఏమంత సాహసమైన పనికాదమ్మా! వాళ్ళు ఎవరికేం నష్టంచేశారు?"

ఈ మాటకు ఛటర్జీ ఇచ్చాడు జవాబు. "నష్టం చెయ్యకపోవటమేమిటి? మొన్న నేను దారివెంబడి పోతూంటే దార్లో కూర్చుని మేకలకు గంజిపోస్తున్నారు. దారంతా ఆ ఎంగిలి చుక్కలు పడ్డాయి" అని అతడు జగద్ధాత్రికేసి చూశాడు.

ఆమె వెంటనే సమర్థిస్తూ "పడకపోవటమేం మామా?" అంది.

"అలా చెప్పు. తెలియనప్పుడు విషమైనా త్రాగవచ్చు గాని, తెలిశాక త్రాగగలమూ?" అని సంధ్యకేసి చూసి నవ్వుతూ "నీది చిన్న వయస్సు మనమరాలా! నువ్వు రాత్రిళ్ళయినా స్నానం చెయ్యగలవు - కాని నేను చెయ్యలేను" - అన్నాడు.

సంధ్య మనస్సులోఉన్న కోపాన్ని అణచుకుని, "ఆ సంగతి తెలుసు తాతా! కాని నాన్న వాళ్ళకు ఆశ్రయమిచ్చినప్పుడు- వాళ్ళకు మరెక్కడయినా కాస్త ఆశ్రయం

దొరకకండేదే వాళ్ళను వెళ్ళకొట్టి ఆయనను ఎలా అవమానం చెయ్యను ?" అన్నది,

కూతురు నోట్లోంచి మానం, అవమానం మాటలు వచ్చేసరికి కోపంకొద్దీ తల్లికి నోటివెంట మాట రాలేదు. కాని, "సరే మంచిదే- కాని వాళ్ళకేం తక్కువ ? అసలుడి ఇంటివెనకాల బోలెడంత చోటుఉంది. కాస్తవాళ్ళకు చోటు ఇవ్వమని వాడితోనే చెప్పరాదూ ? యానాదివాళ్ళయినా- వాళ్ళు హిందువులు. వాళ్ళమూలంగా వాడికి జాతిపోయే దేమీ లేదు." అని ఛటర్జీ జగద్ధాత్రి ముఖంకేసి చూసి, ముసిముసినవ్వులు నవ్వారు. ఆయన మాటల్లోని ఆ రసాన్ని ఆమె ఎంత గ్రహించినా- అసలుడి ప్రసక్తిరాగానే అజ్ఞాను కాలన్యే కూతురు భయంకలిగించేంత కఠోరంగా ఏదో అనేస్తుంది - అనే భయంతో ఆమె ఉత్కంఠకు అవధిలేక పోయింది.

సరీగ్గా అంతే జరిగింది. సంధ్య కంఠస్వరంలో పరిహాస తరళత ప్రకాశించింది కాని ఆమాటలు వింటానికి ఎంత తీక్ష్ణంగా ఉన్నాయో అంత కటువుగా ఉన్నాయి. "పోతే మాత్రం దానికి జమా ? ఖర్చా ? చెప్పండి. జాతినే లక్ష్యం చెయ్యనివారికి- ఇహ అది ఉన్నా పోయినా రెండూ ఒకటే."

ఛటర్జీ నవ్వాలని ప్రయత్నించారు. కాని ఆయన ముఖం మాడిపోయింది. "ఈ మాటలన్నీ నీతో అతను సంప్రదిస్తాడు కాబోలు !" అన్నారు.

సంధ్య కిలకిల నవ్వుతూ, "భలేభలే తాతా ! అతడు మిమ్మల్నే కుక్కలక్రింద పిల్లలక్రింద కట్టేసి లెక్క చెయ్య

నప్పుడు - ఇహ నన్ను ఇది చేస్తాడా?" అని ఆమె వాద ప్రతి వాదాలకోసం కనిపెట్టుకు కూర్చోకుండానే- కన్నుమూసి తెరచేలోపున చిటుక్కున గదిలోకి వెళ్ళిపోయింది.

జగద్ధాత్రి ఇంక సహించలేకపోయింది. "దౌర్భాగ్యురాలా! పరాయివాళ్ళ కుర్రాడిమీద నువ్వు ఒట్టి అపవాదు వేస్తున్నావు! అతణ్ణి ఎవరెరుగరు! అతడు ఎన్నడూ ఈ మాటలు అనలేదని నేను గంగలో నిలబడి ప్రమాణంచేస్తా."

గదిలోనుంచి సమాధానమేమీ రాలేదు. "కాదు జగ్గూ! అసలీకాలపు పిల్లలేయింత! పోనీలే కుక్కలమూ పిల్లులమూ అయితే అయాం కాని, నీకు ఇవాళ ఒకమాట చెప్పి వెడుతున్నా. పిల్లదానికి పెళ్ళిచెయ్యటానికి ఇంక ఆలస్యం చెయ్యకు. ఎక్కడయినా ఇచ్చి చెయ్యి. కాని ముందు ఈ పాపాన్నుంచి విముక్తి కలిగించుకో!" అన్నాడు ముఖర్జి.

జగద్ధాత్రి ఏడుస్తూ "ఒకసంబంధం నువ్వే చూడ రాదామామా! నేనింకఎక్కడా వెతకలేక పోతున్నా "అంది

ఛటర్జి తలతిప్పుతూ! "సరేచూస్తాలే. కాని ఒక్క విషయం. నీకు ఒక్కగానుఒక్క కూతురాయె. ఎక్కడయినా దూరానఇచ్చి చేస్తే దిగుళ్ళతో కుళ్ళి చావల్సి వస్తుంది. మాలాంటివాళ్ళ ఇళ్ళలో :వరుడి వయస్సు చూస్తేకాదు. అయినా ఎదురుగా పడిఉంటుంది. రెండు పూటలా కాస్త కంటికైనా కనిపిస్తూ ఉంటుంది. అంతకన్న ఇంక సుఖమేమేముంది?" అన్నాడు.

జగద్ధాత్రి కళ్ళు తుడుచుకుని, కరుణస్వరంతో. "అంత అదృష్టం ఎలా లభిస్తుంది మామా! అయినా ఇల్లరి కపుటల్లుడు-"

ఛటర్జీ ఆమాట పూర్తికాక ముందే "ఛీ! ఛీ! అలాంటిమాట ఇంకెప్పుడూ తలపెట్టకు. ఇల్లరికపుటల్లుళ్ళు వచ్చేరోజులుకావు పద. దానిమూలంగా బోలెడపనిందలు బయలుదేరుతాయి. అదీకాక ఎక్కడనుంచైనా ఓ గోవిందుణ్ణి గొప్పచేసి ఇంటికి తెచ్చుకుంటే వాడు భంగు, గంజాయీ త్రాగుతూ నీ ఆస్తినంతా తగలేస్తాడు. నీసంగతి కూడా కాస్త ఆలోచించి చూచుకోనఖ్ఖర్లా" అన్నాడు.

ఈ మాటల్లో నిగూఢంగాఉన్న సూచన జగద్ధాత్రి గ్రహించి కళ్ళల్లో కన్నీరుస్తూ, "చాలాకాలం నుంచీ చూస్తూనే ఉన్నానుమామా! చూసుకుని చూసుకుని నాలో నేను కుమిలిపోతున్నాను." అంది.

ఛటర్జీ చిరునవ్వునవ్వి "అదుగో అల్లాచెప్పు. పనీ పాటా లేకుండా కూర్చుని తింటూంటే ఇలాగే అవుతుంది. ఈసంగతి నీలాంటి బుద్ధిమంతురాలు గ్రహించలేదూ?" అన్నాడు.

జగద్ధాత్రి ఉప్పొంగిపోయి, "గ్రహించకపోవటమేం? లోపల్లోపల అన్నీ తెలుసు నాకు, కాని నేను ఆడదాన్ని. ఎటుచూద్దామన్నా పారం కన్పించటంలా." అన్నది.

చటర్జీ ఊరడింపుగా, "కన్పిస్తుంది. తొందరపడితే ఏం లాభం? కాస్త ఆలోచించుకొని చూడరాదూ? సరే వెడతా, ఇంక సంధ్యాసమయం అయింది" అన్నాడు.

జగద్ధాత్రి వినయంగా "మామా! ఇందాకట్నుంచీ అలానుంచునే ఉండిపోయావు. ఒక్కనిమిషం కాస్త కూర్చో" అంది.

"కాదు అమ్మాయీ! సంధ్యవేళ దాటిపోతోంది. ఇంక ఆలస్యం చెయ్యటానికి వీల్లేదు." అని గోలోక ఛటర్జీ మెల్లిగా వెళ్ళిపోయాడు. జగద్ధాత్రి అతడి ముందు నడుస్తూ వీధి గుమ్మందాకా అతడితో కూడా వెళ్ళింది.

౨

ప్రొద్దున్నే ప్రియముఖర్జీ హడావుడిపడుతూ, హోమ్యోపతీ పుస్తకం చంక నెట్టుకుని, మందులపెట్టె తువాల్లో కట్టి చేత్తో పుచ్చుకుని వెడుతున్నాడు. వెనకాలే ఒక అలగా జాతి విధవరాలు "బాబుగారూ! మీరు దయ చూపించక పోతే మేము యెక్కడికిపోతాం?" అని సవినయంగా ప్రార్థిస్తూ వస్తోంది.

ముఖర్జీ ముఖం వెనక్కి తిప్పి మాట్లాడే అంత తీరిక లేదు. అతడు చెయ్యి వెనకాలే ఆడిస్తూ "వీల్లేదు. ఇంక మిమ్మల్ని అక్కడ ఉంచలేను. మీరు కేవలం అలగాజాతి వాళ్ళు, నువ్వు మేకలకి గంజి యెందుకుపోశావ్?" అన్నాడు.

విస్మితురాలై "అందరి మేకలూ గంజి తాగుతాయి బాబూ?" అంది ఆమె.

ముఖర్జీ మండిపడుతూ, "ఛో మళ్ళీ అబద్ధాలాడుతున్నావు! యెవరి మేకలూ గంజి తాగవు. మేకలు గడ్డి మేస్తాయి" అన్నాడు.

"గడ్డి తింటాయి. ఆకూ అలమూ తింటాయి. గంజీ త్రాగుతాయి బాబూ!"

ముఖర్జీ అలాగే చెయ్యి తిప్పుతూ, "పిల్లేమ, మిమ్మల్నిక ఉండనీయను నేను. మీరు ఇవ్వాళే లేచిపోవాలి. బ్రాహ్మణ వీధిలో మీరు మేకలకు గంజి పోస్తున్నారని గోలోక ఛటర్జీ చెప్పిపోయాడు. ఇంక మీమీద జాలిలేదు, నాకు. మీరు ఒట్టి అలాగాజాతివాళ్ళు" అన్నాడు.

అది ఆఖరుసారి ప్రార్థనగా "అయితే గంజి పోయటం మానెయ్యమా బాబూ?" అంది.

ముఖర్జీ సంకోచించకుండా, "ఆఁ. మానెయ్యండి, మీకు ఆవులుంటే పోసుకున్నా తప్పులేదు. కాని ఇదిచాలా భయానక విషయం. ఇవాళే లేచిపోండి. తెలిసిందా? ఊఁ చాలా పొద్దెక్కిపోయింది. 'సల్ఫర్' ఇచ్చేవేళ దాటిపోతోంది" అని గబగబా వెళ్ళిపోబోతుండగా. అది వెనక నుండి "బాబూ! నిన్నటినుంచీ మాపిల్లది ఒక్కమెతుకైనా నంజలేను-" అంది.

ముఖర్జీ తక్షణమే వెనక్కితిరిగి, "యెందుకని? ఎందుకని? కడుపులో నొప్పా? డోకులు వెడుతున్నాయా?"

యానాది కాదని తల తిప్పింది.

"అయితే మరేమిటి? కడుపు ఉబ్బరంగా ఉందా? ఆకలి లేదా?"

"విపరీతమైన ఆకలి బాబుగారు!"

"ఓ, అలాచెప్పు. అదికూడా ఓ పెద్ద జబ్బే. నేత్రం., అయోడం, ఇలాంటివే ఇంకా చాలా మందులున్నాయి.

ఇంతసేపటిదాకా చెప్పలేదేం? చూసి చటుక్కున ఏదో ఓమందు ఇచ్చేవాణ్ణిగా! పద చూస్తా-"

అది కొంచెం వెనకామునదాకి, "మందు అక్కర్లేదు బాబూ! కాసిని బియ్యపు నూకలు యిప్పిస్తే పిల్లదానికి వండిపెడతా" అంది.

ముఖర్జీ ఒక్కనిమిషం విస్తుపోయిచూసి, మండిపడుతూ "మందు అక్కర్లేదు బియ్యం కావాలా? నా ఎదటినుంచి పో అవతలికి, పాపిష్టిదానా! అలగాజాతి మొహంమండ!" అన్నాడు.

యానాదిది సిగ్గుపడి వెళ్ళబోతూంటే, ముఖర్జీగద్దిస్తూ "తినటానికి లేకపోతే సంధ్యదగ్గరకు వెళ్ళి అడగలేక పోయిందా?" అన్నాడు.

యానాదిది నిశ్శబ్దంగా తలమాత్రం ఎత్తి చూసింది.

"ఇంటావిడదగ్గర కెళ్లేరుసుమా, చస్తాను. చెరువుగట్టు మీదనుంచి సంధ్యవస్తే నా వైద్యమందులపెట్టెలో ఒక అర్థ రూపాయి ఉంది ఇవ్వమన్నానని చెప్పు. కాని ఇప్పుడే చెబు తున్నానుసుమా! జబ్బువస్తే నన్నేపిలవాలి. అప్పుడు పిపీనుడి దగ్గరకు వెళ్ళారంటే- ఎవరూ త్రిలోకీకదూ? షష్టీచరణుడే! సరే. ఇంట్లో అంతా బాగున్నారా?"

యానాదిది మెల్లిగా వెళ్ళిపోయింది. త్రిలోకీ, షష్టీ చరణుడు ఎదటికివచ్చి, నమస్కరించి, "చిత్తం మీ దయ వల్ల అంతా కులాసాగానే ఉన్నారు." అన్నారు.

ప్రియముఖర్జీ అస్ఫుటంగా ఆశీర్వదిస్తూ, "మంచిది, మంచిది. రోజులేమీ బాపుంటంలేదు. నాకు స్నానంచెయ్యటానికీ, భోజనం చెయ్యటానికీకూడా తీరికలేకుండా ఉంది. ప్రతిఇంట్లోనూ, దగ్గులూ, పడిశాలూ ... ప్రొద్దున్నే వెడుతున్నా రెక్కడికి ?" అన్నాడు.

"చిత్తం. తమ దగ్గరకే" అన్నాడు త్రిలోకి.

ముఖర్జీ ఉత్సాహితుడై "ఎందుకు ? ఎందుకు ? నా దగ్గిర కెందుకు ?" అనిప్రశ్నించాడు.

"ఊళ్ళోవాళ్ళ రాకపోకలకి మహాకష్టంగా ఉంది ముఖర్జీగారూ ! అదే, కాలవమీద వంతెన తయారు చేయిస్తున్నాం. మీరు వైకుంఠుడికి మక్తాకిచ్చిన తోటలో ఉన్న చిన్న వెదురుచెట్లు ఇవ్వకపోతే పని ఏమీ జరిగేట్టులేదు." అన్నాడు త్రిలోకి.

ముఖర్జీ కోపంతెచ్చుకొని, "నేను ఇవ్వటం ఎందుకు ? ఊళ్ళో ఇహ ఎవరూలేరా ?" అన్నాడు.

ముసలిషష్టీచరణ్ ఇంతసేపటిదాకా మెదలకుండా ఊరుకున్నాడు. ఈసారి మళ్ళీ తలవంచి నమస్కరించి, "మీరు అభయమిస్తే చెబుతాను బాబుగారూ ! ఈ ఊళ్లో మీరుతప్ప మనిషి అన్నవాడు - మరొకడు లేడు. మీరు దయతలిస్తే పదిమందీ బ్రతికిపోతారు. లేకపోతే మేం బీదవాళ్ళం. వెదురువాసాలు కొనేందుకు డబ్బెక్కడిది మాకు?" అన్నాడు.

ముఖర్జీ ఒక్కనిమిషం ఆగి, "ఊళ్ళోజనానికి ఇబ్బందిగా ఉందా ఏమిటి ?" అన్నాడు.

"చచ్చిపోతున్నారండి బాబుగారూ! చేతులు కాళ్లూ విరిగి చస్తున్నారంటే నమ్మండి." అన్నాడు త్రిలోకి.

"కాని ఇంటావిడ విన్నదంటే మహా కోప్పడుతుంది." అన్నాడు ముఖర్జీ.

"మీరు ఇస్తే ఆమెగా రేంచేస్తుంది ? అప్పుడు కాదంటే అంతా వెళ్ళి ఆమె కాళ్ళమీదే పడతాం" అన్నాడు షష్టిచరణ్.

ప్రియముఖర్జీ కాస్సేపు ఆలోచిస్తూ నిలబడి, "పది మందికీ ఇబ్బందిగా ఉందిగా, సరే వెళ్ళి తెచ్చుకోండి. కాని, ఆవిడకుమాత్రం తెలియనీకూడదు. ఉష్... చాలా పొద్దెక్కిపోయింది. రసిక్ బాగ్ది పెళ్ళానికి రాత్రి ఎలా ఉందో ఎవరెరుగుదురు ! బ్రయోనియా యాక్లమ్—కదిలినా, మెదిలినా నొప్పి ఉంటుందిలే. సరే, వెడుతున్నా, వెడుతున్నా" అంటూ గబగబా వెళ్ళి అదృశ్యుడైపోయాడు.

ముసలిషష్టీచరణ్ కొంచెం నవ్వాడు. కాని త్రిలోకి మాత్రం - "ఈయనకు పిచ్చ అంటారు లోకులు, నిజమే! కాని బాబాయ్, పిచ్చి మారాజులుతప్ప బీదవాళ్ళ కష్టసుఖాలు గ్రహించేవాళ్లెవరూ లేరు. గంగాజలంలాగా స్వచ్ఛమైన మనస్సు" అని అతడు ఆ పిచ్చిమారాజు వెళ్ళినవైపుకు తిరిగి, చేతులు రెండూ జోడించి దణ్ణంపెట్టాడు.

"హుకుమయింది. ఇంక ఆలస్యంచెయ్యవద్దు. త్రిలోకీ! తొందర తొందరగా పని పూర్తిచేసుకోవాలి" అన్నాడు షష్టీచరణ్.

"అయితే పద పోదాం బాబాయ్" అన్నాడు త్రిలోకి తల ఊగిస్తూ.

౬

సంధ్యచీకటి మెల్లిమెల్లిగా దట్టంగా వ్యాపిస్తోంది. కాని అప్పటికింకా దీపాలు పెట్టలేదు. అరుణ్ తన చదువుల గదిలో మధ్య టేబిల్ మీద రెండుకాళ్ళూ పెట్టుకుని దూలాలకేసి చూస్తూ కదలకుండా కూర్చున్నాడు. అతడి ఒళ్ళో పుస్తకం తెరిచేఉంది. కాని, కొంచెం జాగ్రత్తగా చూస్తే కేవలం సంధ్యచీకటే పుస్తకం చదవకపోవటానికి కారణం కాదని తెలిసిపోతుంది. పైగా వెలుగు బాగా ఉన్నప్పుడుకూడా ఆ పుస్తకం ఒళ్లో అలాగే పడిఉంది. నిజానికసలు అతడు ఆ రోజునుంచీ ఏపనీ చెయ్యటంలేదు. గుమ్మం కదిలి బైటికి కూడా పోవటంలేదు. ఈ మధ్య కొన్నాళ్ళనుంచీ - 'తాను ఒక వ్యక్తికి కేవలం అస్పృశ్యుణ్ణి అయిపోయానే' అన్నమాటే క్షణక్షణానికీ జ్ఞాపకంవస్తోంది. తనను తాకినంత మాత్రాన నోట్లోఉన్న తమలపాకుకూడా ఉమ్మేసేటంత వరకూ పోయాయి - తనంటే అసహ్యమూ, అశుచీ కూడా—!

హఠాత్తుగా అతడి ఆలోచనలకు అడ్డు తగిలింది. తలుపు దగ్గర ఏదో చప్పుడవటం విని, అతడు కళ్లెత్తిచూసి, "ఎవరక్కడ ?" అని ప్రశ్నించాడు.

"నేను సంధ్యను" అని జవాబు చెప్పి ఆమె తలుపు తెరుచుకుని, గుమ్మాని కానుకుని నుంచుంది.

అరుణ్ చటుక్కున టేబిల్ మీదనుంచి కాళ్ళుతీసి లేచి నుంచుని, అత్యాశ్చర్యంతో, నువ్వు ఇలా వచ్చావేం?" పైగా ఇలాంటి సమయంలో ? లోపలికి వచ్చి కూర్చో !" అన్నాడు.

"నాకు కూర్చునేటంత తీరిక లేదు. నేను చెరువుకు స్నానానికి వెళుతూ నీ దగ్గిర కిక్కడికి చాటుగా వచ్చాను. మా పరువు కాస్త నిలబెట్టాలి అరుణదా !"

అరుణ్ మరింత విస్మితుడై "పరువా ? మీదా ? తప్పకుండా నిలబెడతాను సంధ్యా !" అన్నాడు.

"ఆ సంగతి నాకు తెలుసు" అని సంధ్య ఒక్క క్షణం మాట్లాడకుండా ఊరుకుని, "ఈమధ్య నువ్వు ఏపనీ చెయ్యటం లేదనీ, ఇంట్లోంచికూడా బైటికి రావటంలేదని నాన్న చెబితే విన్నాను. ఎంచేతో తెలుసుకోవచ్చా ?"

ఆ, నాకు వంట్లో బాగుండటంలా.

"బాగుండకపోవటమేమీ ఆశ్చర్యం కాదు కాని, అసలదికాదు. అయినట్లయితే నాన్న అన్నిటికన్నా ముందు ఆ మాటే చెప్పేవాడు"

అరుణ్ మెదలకుండా ఊరుకున్నాడు. సంధ్యకూడా కాస్సేపటివరకూ నిశ్చలంగా ఊరుకుని, "కారణం నాకు తెలును అరుణదా ! కాని నువ్వు మాఇంటికి ఇంకెప్పుడూ రావద్దు" అన్నది.

అరుణ్ మెల్లిగా తల ఊగిస్తూ "రాను. కేవలం మీ ఇంటికే కాదు, ఈ ఊరువదిలేసి, ఎక్కడయితే దోషం లేక

పోయినా మనుష్యుల్ని మనుష్యులు ఇంత హీనంగానూ, ఇంత నింద్యంగానూ చూడకుండా ఉంటారో - అక్కడికే పోయి ఉందామని - ఆ సంగతే రాత్రింబగళ్ళు ఆలోచిస్తున్నాను" అన్నాడు.

సంధ్య ముఖమెత్తి "జన్మభూమి వదలి వెళ్ళిపోతావా!" అంది.

"జన్మభూమే నన్ను వదిలేసింది సంధ్యా! ఈనాడు నీకుకూడా-నువ్వు నోట్లో తమలపాకు ఉమ్మివేయాల్సి వచ్చినంత అపవిత్రుణ్నే అయిపోయాను. ఇంతటి అసహ్యాన్ని సహిస్తూకూడా ఇంకా నన్ను ఈ ఊళ్ళోనే ఉండమంటావా నువ్వు?"

సంధ్య నిరుత్తరయై తలవంచుకుని అలాగే నుంచుని ఉంది. "ఆచారమనే పేరుతో చిరకాలంనుంచి వస్తున్న సంస్కారం మీ మనస్సులను బహుశా ఇంకెన్నడూ స్పృశించదు. కాని ఎక్కడైతే స్పృశిస్తుందో అక్కడ మనుష్యుడి చేతిమీదుగా సాటి మనుష్యుడికి జరిగే అవమానం వేదనతో ఎంతదూరం గుచ్చుతుందో - ఈ విషయం ఒకనాటికి నాకు ఇలా అనుభవంలోకి వస్తుందీ - అని నేను స్వప్నేపి అనుకోలేదు సంధ్యా!" అన్నాడు అరుణ్.

సంధ్య ఒక్కక్షణం మౌనం వహించి, "కాని ఈఅవమానాన్ని నీ అంతట నువ్వు తెచ్చిపెట్టుకోలేదా అరుణ్‌దా!" అంది.

"ఏం తెలుసు! కాని సరే, సంధ్యా! ప్రాయశ్చిత్తం

చేసుకుంటే దీనికేమైనా ఉపాయముంటుందేమో చెప్ప గలవా ?"

"ఉండవచ్చు. కాని ఒకప్పుడు ఆత్మగౌరవం పోతుం దేమో అన్న భయంతో నువ్వు దీనికి ఒప్పుకోలేను. మళ్ళీ ఈనాడు నీఅంతట నువ్వే ఆ గౌరవాన్ని వదిలివేసుకున్న ట్లయితే, నేను చెబుతున్నాను అరుణదా, నువ్వింక ఏమనాన్న చెయ్యికానీ ఈ ఊళ్ళోమాత్రం ఉండొద్దు."

"కాని నువ్వు నన్నక్క డున్నా అసహ్యించుకోవు గదా !"

"కాని అలా అసహ్యించుకుంటే మాత్రం ఇందులో నీకు నష్టమేమిటి ?"

"సంధ్యా ! ఈమాట నీ నోటిమీదుగా నువ్వుకూడా అనగలిగావా ?"

"నువ్వు నా లజ్జాసంకోచాల ఆవరణనికూడా ఉండ నిచ్చావు కాదు అరుణ్ దా ! నీకు ఎన్నోసార్లు ఆభాసగా సూచనగా తెలియ జేశాను—కాని ప్రయోజనం లేకపోయింది. కాని నీ భిక్షాబలాత్కారాన్ని ఏవిధంగానూ ఆపుకోలేక పోయావు. నాన్న అంగీకరించవచ్చు. అమ్మకూడా మరిచి పోవచ్చు. కాని నేను మాత్రం మరిచిపోను. నేను ఎంతో గొప్ప బ్రాహ్మణ—పడుచును."

అరుణ్ ఆశ్చర్యంతో విస్తుపోయి "మరి నేను ?" అన్నాడు.

"నువ్వుకూడా నాజాతివాడివే-కాని పులీ, పిల్లి ఒకటి కాదు అరుణదా !" సంధ్య ఈ మాటయితే అన్నదికాని,

అంటూఉండగానే లోపల్లోపల తనంతటతాను వణికి పోయింది.

అరుణ్ ఇంక మాట్లాడలేదు. విస్మయంతోనూ, వ్యథ తోను నిండిపోయిన తన నేత్రాలను మాత్రం సంధ్య ముఖం మీదినుంచి మరల్చుకున్నాడు.

సంధ్య బలవంతంగా నవ్వటానికి ప్రయత్నించి, "నువ్వు ఎక్కడకైనా వెళ్ళనీ అరుణ్‌దా! నన్ను మాత్రం సులభంగా మరచిపోలేవు. చాలాకాలం వరకు జ్ఞాపకముంటా నీకు. మాటిమాటికీ నీకిన్ని అవమానాలు ఎవరూ చెయ్యలా!" అంది.

అరుణ్ తలఎత్తి "నువ్వు ఎందుకోసం వచ్చావో ఆసంగతి ఇంతవరకూ చెప్పలేదేం?" అన్నాడు.

సంధ్య సమాధానంగా కొంచెం నవ్వింది. ఒక్కక్షణం మెదలకుండా పూరుకుని, "పృథివిలో ఆశ్చర్యాలకు అంతు అంటూలేదు." అని యింకేదో చెప్పబోయి కాస్త ఆగి, "అయినా సామర్యాదను నువ్వు నిలబెట్టకపోతే, పృథివిలో ఇంక నిలబెట్టేవారెవరూ లేరు. ఈమాట నువ్వు విశ్వసిస్తావా అరుణ్‌దా!" అంది.

అరుణ్ నిశ్శబ్దంగా చూస్తూ పూరుకున్నాడు.

"ఒక యూనాది విధవదాన్ని, దానికూతుర్ని, దాని తండ్రి ఇంట్లోంచి వెళ్ళకొట్టాడు. మానాన్న వాళ్ళను పిలుచుకువస్తే, నేను వాళ్ళకి ఆశ్రయమిచ్చాను."

"ఎక్కడ?"

"మాపాత పశువులపాకలో. కాని బ్రాహ్మణ-వాడ కట్టున వాళ్ళను ఉంచకూడదు."

అరుణ్ విస్మితుడై "ఎందుకని?" అని అడిగాడు.

"ఎందుకనేమిటి? వాళ్ళు యానాదివాళ్ళు! వాళ్ళు మన చెరువు - రేవులోంచి మంచినీళ్ళు తెచ్చుకుంటారు. దారిలో మేకలకు గంజిపోస్తూఉంటారు. గోలోకఛటర్జీ తాత పొరపాటున ఎక్కడ తొక్కుతాడో అని—అమ్మవాళ్ళను రేపొద్దున్నే ముందు చీపురుకట్ట తిరగేసి వాళ్ళని తన్ని వెళ్ళ గొట్టికాని స్నానం చెయ్యనంటూ శపథంచేసుకు కూర్చుంది. నువ్వు వాళ్ళకు కాస్తచోటు ఇయ్యి అరుణదా? వాళ్ళకేమీ లేదు. కేవలం నిరాశ్రయులు."

"మంచిదే కాని చోటు ఎక్కడ ఇవ్వను?"

"అది నాకు తెలియదు—ఎక్కడైనా ఇయ్యి. నీకు కాక, ఎవరి దగ్గరకెళ్ళి చెబుతాను?"

అరుణ్ కొంచెం ఆలోచించి "మా ఒరియా తోట మాలి వాళ్ళ దేశం వెళ్ళాడు. వాడి పాలోకవాళ్ళు ఉండ గలరా? అయితే కాస్త ఆ ఇల్లు సర్దిస్తాను" అన్నాడు.

సంధ్య ముఖమెత్తి మాట్లాడలేకపోయింది. అదో ముఖంగా ఉన్నది, అలాగే తలతిప్పి ఒప్పుదల తెలియజేసింది.

"అలా అయితే వాళ్ళను పంపించు. తోటమాలి తిరిగివస్తే వాడికి మరో ఏర్పాటు ఏదయినా చేస్తాను."

సంధ్య దీనికికూడా సమాధానం చెప్పలేకపోయింది. అలాగే నతనేత్రి అయి నిలబడిఉండి తననుతాను సంబాళించు

కుంటోందేమో ! తర్వాత మెల్లిగా, "ఇప్పుడు నానోట్లో తాంబూలమూ లేదు. స్నానం చెయ్యటానికి వెళుతున్నా. ఇప్పుడే నీకు కొంచెం నమస్కరించి పాదధూళి తీసుకుని వెడతాను" అని ఆమె సాష్టాంగంగా నమస్కరించి, అతడి పాద ధూళిని శిరస్సున ఉంచుకుని చటుక్కున అక్కడనించి అదృశ్యురాలైంది.

ఆమెను మళ్ళీ వెనక్కి పిలుద్దామనికాని, ఇంకేమైనా అడుగుదామనికాని ప్రయత్నించకుండానే అరుణ్ ఆమె వెళ్ళిన వైపుకేసి చూస్తూ స్తబ్ధుడై అలాగే కూర్చుని ఉండి పోయాడు.

౭

తరువాత రెండు రోజులయ్యాక కాబోలు-ఒక రోజున జగద్ధాత్రి చెరువుకెళ్ళి స్నానంచేసి ఇంటికి వస్తూంటేదారిలో రాసమణి ఎదురుపడింది. ఆమె కళ్ళూ ముఖంకూడా ఉత్తేజనాధిక్యంతో ప్రస్ఫుటంగా ఉన్నాయి. దగ్గిరగా వచ్చి గద్గద కంఠంతో "జగ్గూ...మాతల్లె...నీ పిచ్చిపిల్ల చివరికెంత తపస్సు చేసుకుందే ! ఆహా ! ఇది స్వప్నానికికూడా అతీతమైన విషయం" అన్నది రాసమణి

జగద్ధాత్రికేమీ అర్థంకాలా. కాని ఆమె నోటిమీదుగా కూతురి మాట విని మనస్సులో భయపడిపోయింది. ఉత్కంఠతో "ఏమయింది పిన్నీ ? సంధ్య ఏంచేసింది ?" అని అడిగింది.

"అదేంచేసినానో – అలాంటిది పృథివిలో ఎవరైనా చేశారేమో చెప్పు చూద్దాం. ఈ తడిగుడ్డలతోనూ, తడితల తోనూ వెళ్ళి శ్రీధరుడికి సాష్టాంగ నమస్కారం చేసిరా! పఞ్చాననుడికీ విశాలక్ష్మికీ సహస్రనామ పూజలు చేయించు. కాని అమ్మాయీ, ఇష్టకవచంతోపాటు మెళ్ళో వేసుకోటానికి నాకు మాత్రం ఒక బంగారపు గొలుసు తయారుచేయించు. ముందే చెప్పిఉంచుతున్నాను సుమా!" అన్నది.

జగద్ధాత్రి కంగారుపడుతూ "ఏం జరిగింది పిన్నీ? విప్పి చెప్పకపోతే తెలుసుకోవటం ఎలా?"

రాసమణి కొంచెం నవ్వుతూ, "విప్పిచెప్పాల్సిందేనా? అయితే చెబుతున్నా. మీతల్లీకూతుళ్ళు మహాపుణ్యం చేసుకున్నారు, లేకపోతే ఇలా ఎన్నటికీ జరిగేదికాదు. కూతురు పెళ్ళి ఎలాచేస్తావా – అని దిగులెట్టుకొని ఛస్తున్నా. ఇంక ఫర్వాలా – ఏకంగా రాజుగారికే అత్తగారివై కూర్చోపో." అంది.

ఆమాట విని జగద్ధాత్రి కళ్ళురెండూ నెత్తిని పెట్టుకొని చూస్తూ వూరుకుంది.

రాసమణి ఎంతో దయచూపిస్తూ, "నీ ఒక్కతె దోషమే కాదిది. జగ్గా, ఈసంగతి విన్నప్పుడు నేనూ ఇలాగే తెలుసుకోలేక ఇదయ్యాను. నిద్దరోతూ, నిద్దరోతూ కలకంటున్నానేమో అనికూడా అనుకున్నాను." అంది.

"ఏం జరిగిందో విప్పిచెప్పు పిన్నీ? ఆకాశ పాతాళాలు గాలించినా తెలీక ఛస్తున్నా" అన్నది జగద్ధాత్రి.

రాసమణి జగద్ధాత్రి చెయ్యిపట్టుకుని దగ్గరగా లాక్కొని చెవిలో ఏదో గుసగుసలాడి, "ఈసంగతి రహస్యంగా ఉంచు అమ్మాయి ! సంతోష పారవశ్యంకొద్దీ పదిమంది ముందరా ఇప్పుడే అనేసెయ్యకు. ఎవరైనా కాకుండా చెయ్యాలని చూస్తారు. నన్నుతప్ప భట్టర్జీదా ఇంకో నరమానవుణ్ణినమ్మడు. అందుకనే పొద్దున్నే నన్నుపిలిచి, 'రాసూ, జగద్ధాత్రిదగ్గరకు ఈకబురు తీసుకెళ్ళి చెప్పు. తన కూతురికోసం ఇంక బెంగ పెట్టుకుని హాతమారిపోనక్కర్లేదు-నా చేతుల్లో పెట్టి ఏకంగా రాజుగారికి అత్తగార్రై కాలుమీదకాలు వేసుకు కూర్చో మను' అన్నాడు. 'మా వైకుంఠపురం కూడా శూన్యంగా కన్పిస్తోంది. - పిల్లవాణ్ణి పెంచేవాళ్ళు ఎవరూలేరు- పోనీ ఒక్కపనితోపాటు రెండుపనులూ కలిసివచ్చాయి. ఒకటేమో బ్రాహ్మడికులం కాపాడటమూ అవుతుంది; వూళ్ళోపిల్ల వూళ్ళోనే ఉండిపోవటం మరోహటి. మీకు అయినా ఒక్క పిల్లేకదా' అన్నారు,

కాని తనమాటను రాజుగారి కాబోయే అత్తగారి ముఖంచూసి - పూర్తిచెయ్యలేక పోయింది, జగద్ధాత్రి వింటూ వింటూనే కొయ్యబారిపోయింది.

రాసమణి కలతపడుతూ "అలా అయిపోయినావేమే జగ్గూ" అన్నది.

జగద్ధాత్రి తనసుతాను సంబాళించుకుని ఒక్క నిట్టూర్పు విడిచి, "కాదు పిన్నీ, భట్టర్జీమామ నీతో తమాషాకి అనుంటాడు" అంది.

"తమాషాఏమిటే ? ఇంత వయస్సువచ్చినా తమాషా అయిందీ కానిదీ ఎరగనా ? అదీగాక అన్నా-చెల్లెలుమధ్య పరిహాసమేమిటి చెప్పు ?"

"తమాషా కాక మరేమిటి పిన్నీ ! ఇది ఎప్పుడైనా జరిగేదేనా?" అన్నది జగద్ధాత్రి.

రాసమణి కొంచెంనవ్వి "అదినిజమే అమ్మాయీ ! మొదట్లో నాకూ అలాగే అనిపించింది. మేలుకున్నానా, కల గంటున్నానా అనుకున్నా. కాని తర్వాత గ్రహించా మేలు కునే ఉన్నానని. పిల్లదాని అదృష్టం అనుకో నిశ్చయంగా. ఇది కాకపోతే కులీనులకన్య అదృష్టంలో ఇలాంటి దెక్క-డయినా చూశామా ? ఎన్నామా ? కన్నెచెర వదలిపోవా లని దీవిస్తున్నా నేను కాని పద- నేను చెప్పిన పనులన్నీ ఇవాళే చేయించు. ఇంక ఈమాట అయిదోచెవిని పడనీకు. ముందు ప్రధానం కానిచ్చేసెయ్యండి" అన్నది.

జగద్ధాత్రి నోటివెంట మాటరాలా. అలాగే నుంచుండి పోయింది.

రాసమణి మళ్ళీ చెప్పటం మొదలెట్టింది. "వచ్చే మార్గశిరమాసం దగ్గరనుంచీ ఒక ఏడాదిపాటు మంచిరోజులు లేవుట. మాఘటర్జీదాదా ఉద్దేశ్యం-" అని కొంచెం ముసి ముసినవ్వులు నవ్వి, "ఎందుకు ఉండవులే చెప్పు? పిల్ల కేవలం శ్రీ మహాలక్ష్మివిగ్రహం. చూస్తే మహామహా మునులకే మనస్సు చెదురుతుందే, ఇహ గోలోకఘటర్జీ ఎంత !" అని నవ్వుతూ జగద్ధాత్రి భుజంమీద వేలితో చిన్న చిటిక వేసి, "పద అమ్మా ! తడిగుడ్డలతో నుంచోకు చాలా ప్రొద్దె

క్కింది, ఇంక నేనూ వెడతా, ఆనకమళ్ళీ వస్తాలే, మాట్లాడ వలసినవి చాలాఉన్నాయి" అని ఆమె ఇంక అట్టేకాలం పృథాకానీయకుండా వెళ్ళిపోయింది.

జగద్ధాత్రి తూలుతూ తూలుతూ ఇంటికివచ్చి పూజా గృహం వసారా అరుగుమీద నీళ్ళబిందె భడేలున దించి, తడి గుడ్డలతో అక్కడే కూలపడింది. ఆమె కళ్ళనుంచి వేడి కన్నీళ్ళు కారుతున్నాయి.

ఆమెకు ఏకైక సంతానం సంధ్య. ఆమె కత్యంత ప్రేమాస్పదురాలైన సంధ్య, రూపంలోనూ, గుణాల్లోనూ కూడా నిజంగా లక్ష్మే. ఆ లక్ష్మీప్రతిమను గోలోకఛటర్జీ నరకకుండంలో విసర్జించమని పిలుపు వచ్చింది. ఈ ఛటర్జీ సంధ్య మాతామహుడికన్న కూడా వయోజ్యేష్ఠుడు. ఆయన చేతిలో పిల్లను అప్పగించడంకన్న మృత్యుదేవతకు అప్ప గించడమే మంచిది.

ఈ విషయం ఆమె హృదయంలో అగ్నిశిఖలాగా జ్వలిస్తున్నా, తన నోటిమీదుగా "ఇవ్వను" అని మాత్రం అనలేకపోయింది. ఆమె స్వయంగా ఉత్తమ బ్రాహ్మణ వంశంలో జన్మించిన స్త్రీ. తన సంఘంలోను, ఇరుగు పొరుగు కుటుంబాలలోనూ ఇలాంటిదొక పెద్ద విచిత్రంకాదు. ఇంత కంటె ఘోరాలనుకూడా తన కళ్ళారా చూసింది. అంచేత తన కూతురి సంగతి జ్ఞాపకం వచ్చినప్పుడల్లా హృదయంలో మంట రగులుతున్నా ఇలాంటిది అసంభవంలే- అని ఆ మంటను ఆర్పటానికి ఎంత వెదకినా ఒక్కనీటిబొట్టు అయినా కన్పించలా ఆమెకు. ఒంటరిగా కూర్చుని కన్నీళ్ళు తుడుచు

కుంటూండగా, 'ఇహ కొద్దిరోజుల్లో ఇదే నిజమైపోతుంది. బహుశా ఈ భయంకర మానవుడికి కలిగిన దుర్జయమైన వాంఛను తుడిచివెయ్యటానికెంత వెదకినా ఉపాయం కన్పించటంలే' దని ఆమె మనస్సుకు తోచసాగింది. ఆరోజున అతడు అతికౌతుకంతో తనతో జరిపిన సంభాషణే ఆమె మనస్సులో గిర్రున తిరుగుతోంది. ఆ మాటల్లో నిగూఢంగా ఇంత విషముందని ఆనాడెవరు సందేహించగలిగారు !

ఎదుటి గుమ్మంలోంచి ఉత్తరం చదువుకుంటూ, ఒక్కొక్క అడుగు వేసుకుంటూ సంధ్య లోపలికి వచ్చింది. అప్పటికింకా ఉత్తరం చదవటం పూర్తికాలేకల్లే ఉంది. కన్నెత్తి ఎటూ చూడకుండానే, 'అమ్మా ! అమ్మా !' అని పిలిచింది.

జగద్ధాత్రి చటుక్కున గబగబా కళ్ళు తుడుచుకొని "ఎందుకమ్మా ?" అంది.

బొంగురుపోయినట్లు వినిపించిన ఆమె కంఠస్వరానికి సంధ్య చకితురాలై ముఖం పైకెత్తి మెల్లిగా దగ్గరకువచ్చి, "ఏం జరిగిందే అమ్మా ?" అన్నది.

జగద్ధాత్రి కుమార్తె తీక్షణదృష్టి నుంచి ముఖం పక్కకు తిప్పుకుని "ఏమీ జరగలేదు అమ్మా !" అంది.

సంధ్య ఇంకా దగ్గిరగావచ్చి, తన పమిటచెంగుతో తల్లి కన్నీళ్ళు సాదరంగా తుడుస్తూ కరుణఉట్టిపడే కంఠంతో "మా నాన్న ఇవాళేమయినా చేశాడా అమ్మా ?" అంది.

జగద్ధాత్రి "లేదు" అని మాత్రం అంది.

కూతురు ఆమాట నమ్మలేదు. మెల్లిగా తల్లి దగ్గర కూర్చుని, "ప్రపంచంలో అన్ని విషయాలూ మనుష్యులకు తృప్తిగా ఉండవు. అందరూ మానాన్నని 'పిచ్చిమహారాజు' అంటారు. నువ్వుకూడా అలాగే ఎందుకనుకోరాదు అమ్మా" అంది.

"అలా అనుకుంటే వాళ్ళకువచ్చిన నష్టమేమీలేదు. కాని నాలాగా ఈ మహాగ్నిని ఎవరూ సహించలేరు సంధ్యా!" అంది జగద్ధాత్రి.

'ఈ జ్వాల ఎలాంటిదో, ఎవరికోసం ఎవరు ఈ జ్వాలను సహించవలసి వస్తుంది.'- ఈ విషయం ఎంత ఆలోచించీ కూడా సంధ్య తెలుసుకోలేక పోయింది. సరళహృదయుడూ, అజాతశత్రుడూ, పరదుఃఖకాతరుడూ, తెలివితక్కువవాడూ అయిన తన తండ్రి దుఃఖంతో, ఆమె మనస్సు స్నేహానమ వేదనలతో నిండిపోయి, రెండు నేత్రాలనుంచీ అశ్రువులు జలజల రాలాయి. "అమ్మా! నాకు సాధ్యమయితే నాన్నను తీసుకుని నేను అడవుల్లోకో, కొండల్లోకో వెళ్ళిపోయేదాన్ని- ఆయన దుఃఖం పృథివిలో ఎవరూ సహించ నవసరంలేకుండా పోయేది." అన్నది.

జగద్ధాత్రి చటుక్కున ఆమెగడ్డంపుణికి ముద్దెట్టుకుని, వాత్సల్యంతో "పోనీవే ఆ మాటలు! కాని, నీకు నేనేమయినా సవతితల్లినా ఏమే! ఆయనలో సగమయినా నన్నెప్పుడన్నా ప్రేమించావుటే సంధ్యా!" అంది.

"నిన్ను నేను ప్రేమించటంలేదా అమ్మా?" అంది సంధ్య.

"కాని ఆయనమీదే నీ మనస్సూ నీ ప్రాణాలు అన్నీను—ఆయన కాలికి ఎక్కడ కంకర గుచ్చుకుంటుందో అన్నట్లు ఉంటుంది నీమనసు. ఆయన ముందు ఏమీ పని చెయ్యొదని నీకు బాగా తెలుసు, అయినా ఆయనకెక్కడ చిన్నతనంగా ఉంటుందో - అని నువ్వు ఇంక ఎవరిమాటా తినకుండా ప్రాణాలమీదికి తెచ్చుకుంటున్నావు. ఈసంగతి నేనుమాత్రం బాగా గ్రహించలేదనుకున్నావా సంధ్యా!"

సంధ్య చేతులురెండూ తల్లిమెడకు పెనవేసి, "అదేమిటి! మా నాన్నగారిలాంటి డాక్టరు ఎక్కడయినా ఉన్నాడా ఏమిటి అమ్మా!" అన్నది.

"లేదు- ఆమాట నిజం."

సంధ్య కోపంతెచ్చుకుని. "పో, నువ్వు ఎగతాళిచేస్తే సరా? మనుష్యులకు జబ్బు ఒక్కరోజులోనే నయమవుతుందా? నేను ఇదివరకుకన్న ఇప్పుడు చాలా కులాసాగా ఉన్నాను." అని ఆప్రసంగాన్ని అంతటితో మార్చి, యానాది వాళ్ళు వెళ్ళిపోయారమ్మా! బ్రతికిపోయారు" అంది.

"ఎప్పుడు వెళ్ళారు?"

"నాకేం - తెలుసు? చీకటితో లేవగానే వెళ్ళిపోయారనుకుంటా."

తన కృత్రిమ ఔదాసీన్యం తల్లిని మరపించలేకపోయింది. "ఎక్కడికి లేచిపోయారో తెలుసా?" అని అడిగిందామె.

సంధ్య అలాగే తనకేమీ తెలియనట్లు, "అరుణదా ఇంటివెనకాల తోటలోకి పోయారేమో! అతడి తోట

మాలికి ఒక పడిపోయిన పాక ఉందిటగా! అందులోకే పోయారేమో!" అంది.

"అరుణ్ దగ్గరకు వాళ్ళని ఎవరు పంపారు? నువ్వే ననుకుంటా?"

సంధ్య తనలోతాను ఇరుకునపడి, ఎలాగో అలా ఆ అబద్ధాన్ని బ్రతికించుకుని, "అరుణదా దగ్గిరకు వాళ్ళను నేనెందుకు పంపిస్తాను అమ్మా? నేను ఎవర్ని ఎవరిదగ్గరకూ పంపలా" అని ఆమె ఈ అనవసర ప్రసంగాన్ని చటుక్కున మార్చేసి, తనచేతిలో ఉత్తరాన్ని మడతవిప్పి పట్టుకుని, "అసలుసంగతి నీకింకా చెప్పనేలేదమ్మా! మా నాయనమ్మ ఈసారి తప్పకుండా కాశీనుంచి వస్తున్నానని ఉత్తరంరాసింది. ఆమె ఎన్నడూ అబద్ధం చెప్పదమ్మా! ఈసారి ఆమెకు దయ కలిగిందనుకుంటాను." అంది.

జగద్ధాత్రి ఔత్సుక్యంతో 'అత్తగారి ఉత్తరమా? ఎప్పుడువస్తానని రాశారు?" అని అడిగింది.

సన్యసించి కాశీలో ఉంటున్న ఆమె అత్తగారు, కాశీ వదిలిపెట్టి ఒక్కరోజైనా ఎక్కడికి వెళ్ళాలన్నా ఇష్టపడదు. 'మీ ఏకైకపాత్రి వివాహానికి మీరు రాకతప్పదనీ, కన్యా దానం మీరే స్వయంగా చేయాలనీ-' ఈసారి జగద్ధాత్రి అనేకవిధాల బ్రతిమాలుతూ ఉత్తరం వ్రాయించింది. కన్యా దానం చెయ్యటానికైతే అత్తగారు ఎన్నివిధాల చూసినా ఒప్పుకోలేదు. కాని ఆ సమయానికి మాత్రం వస్తానని జవాబు వ్రాసింది.

సంధ్య తన వివాహంసంగతి వచ్చేసరికి సిగ్గుపడి, "నీ ఉత్తరానికి సమాధానం నువ్వే చదువుకోరాదా అమ్మా?" అని ఉత్తరం ఆమె ముందరపెట్టి, వ్యగ్రురాలై "అమ్మా! నువ్వింకా ఆ తడిబట్టలతోనే ఉండిపోయావా? వెళ్ళి నీకు చటుక్కున పొడిబట్టలు తెచ్చిఇస్తాను ఉండు" అని గబగబా వెళ్ళిపోయింది అక్కడినించి.

జగద్ధాత్రి ఆ ఉత్తరం శిరస్సున పెట్టుకుని, "నీ కోడలి మీద ఇన్నాళ్ళకు దయకలిగిందా అమ్మా!" అని ఆమె కూడా లేచి మెల్లిగా పూజాగృహంలోకి వెళ్ళబోతోంది. ఇంతలో ఆమెభర్త అతి హడావుడిగా ఇంట్లోకివచ్చి పడి, "నేను రెండురోజులు వెళ్ళలేదు- రెణ్ణాళ్ళు చూడలేదు-ఇలా హాయిపోకాండ్రియా డెవలప్ అయిపోయింది!" అన్నాడు.

భర్తతో జగద్ధాత్రి విశేషించి మాట్లాడదు. కాని అతడి ఈ అతి గందరగోళాన్ని - విశేషించి పన్నెండు కాక పూర్వమే హఠాత్తుగా అతడు ఇంటికి రావటాన్ని చూసి విస్మితురాలైంది. ముఖం పైకెత్తి నిదానంగా "ఎవరికేమయింది?" అని అడిగింది.

"అరుణ్! సరిగ్గా హాయిపోకాండ్రియా! నేను డయాగ్నైస్ చేసింది కాదంటానికి ఎవడి అబ్బతరం! ఇదేమిటో విపిన్ణి చెప్పమను-చూద్దాం!"

మరొకప్పుడయినట్లయితే జగద్ధాత్రి ఇంకేమీ మాట్లాడేదికాదు. కాని అరుణుడి పేరువిని కొంచెం ఉద్విగ్నురాలై "అరుణ్కి ఏమయింది?" అని అడిగింది.

"ఏమిటో చెప్పాగా! అదేమిటో విపినుడికే తెలియక పోతే ఇంకా నీకా తెలిసేది? అయినా వాడుకూడా ప్రాక్టీసు- ప్రీక్టీసు కాస్త చేస్తున్నాడు. సామానులు అన్నీ మూట కట్టాడు ఇల్లూ వాకిలీ, పొలమూ పుట్రా - తోటా దొడ్డి అన్నీ అమ్మేశాడు. హరీంద్రుడు కొనబోతున్నాడు- అదృష్ట వశాత్తూ నేను వెళ్ళిపడ్డా. నేనొకరోజున ఎటుకేసి అయితే వెళ్ళనో, ఎటుకేసి అయితే చూడనో అక్కడ ఇలాంటి దేదో విపరీతసంఘటన జరిగితీరుతుంది. ఇల్లా అయితే నేనింక బ్రతకలేను బాబూ! సంధ్యా, మళ్ళీ ఎక్కడికి వెళ్ళావ్? చప్పునోసారి 'మెటెరియా మెడికా' తీసుకురా అమ్మా! ఓ రెమిడీ సెలెక్టుచేసి తీసుకెళ్ళి ఇచ్చేసివస్తా" అన్నాడు ప్రియ ముఖర్జీ.

"వస్తున్నాను నాన్నా!" అని సంధ్య ఒక ఆవాంటి పుస్తకం పట్టుకొనివచ్చి దగ్గర నిలబడింది.

జగద్ధాత్రి కోప్పడుతూ - "మీ కాళ్ళమీద పడతా సరీగ్గా తెలిసేట్లు చెబుదురూ? అరుణ్‌కి ఏమయింది?" అని అడిగింది.

ముఖర్జీ చకితుడై కాస్త ఆగి- "హాయిపో- మానసిక వ్యాధి. ఇవాళ రేపట్లోనే అతడీఊరు విడిచిపెట్టి పోదామను కుంటున్నాడు-హరీంద్రుడికి అంతా అమ్మేశాడు. అలా జరగ డానికి వీల్లేదు-వీల్లేదు. అల్లా జరగనీయను నేను. టుహండ్రెడ్ పొటెన్సీమందు ఒకటి——"

సంధ్య ముఖం వివర్ణమయింది. జగద్ధాత్రి వ్యాకుల కంఠంతో "అరుణ్ ఇల్లూ వాకిలీ అమ్మేసి పోతున్నాడా? అతడికేమయినా పిచ్చెక్కిందా?" అన్నది.

ప్రియముఖర్జీ చెయ్యెత్తి ఎదురుగా పెట్టి, "ఊహూం, అది కాదు అది కాదు. అక్షరాలా హైపోకాండ్రియా పిచ్చి కాదు. పిచ్చి అయితే ఇన్‌స్యానిటీ అంటారు. దానికి మందు వేరు. విపిన్ అయితే అదే పట్టుకు కూర్చునేవాడు వాస్తవంగా. కాని—"

జగద్ధాత్రి ఒక్క చూపుతో కుమార్తె ముఖంలోని భావాన్ని గ్రహించి అనర్గళమైన భర్త వాగ్ధాటిని ఒక్క గదమాయింపుతో ఆపి, అతిస్పష్టంగా "మీ మాటలన్నీ వినేందుకు నాకు తీరిక లేదు. అరుణ్ నిజంగా ఊరు వదిలిపోదా మనుకుంటున్నాడా?" అంది.

"అనుకుంటున్నాడా? వెళ్ళటానికి అన్నీ సిద్ధం చేసుకుంటేనే...! కేవలం నేను వెళ్ళానుగనుక—"

"మళ్ళీ 'నేనం'టారు? అరుణ్ ఎప్పుడు వెడతాడు?"

ప్రియముఖర్జీ కొంచెం నీళ్ళు నములుతూ – "ఎప్పుడేమిటి? ఇప్పుడెళ్ళినా వెళ్ళవచ్చు; రేపు వెళ్ళినా వెళ్ళవచ్చు; ఆ హరీన్‌గాడున్నాడే–"

"హరీన్ అంతా కొంటానని చెప్పాడా?" అంది జగద్ధాత్రి.

"నిశ్చయంగా, నిశ్చయంగా. వాడు చవకలో కొట్టెయ్యాలని అనుకుంటున్నాడు."

"ఈ సంగతి ఊళ్ళో ఇంకెవరికయినా తెలుసునా?" అని జగద్ధాత్రి మళ్ళీ ప్రశ్నించింది.

"ఎవ్వరికీ ఒక్క నరమానవుడికైనా తెలియదు- కేవలం నాకు మాత్రం అదృష్టవశాత్తూ-"

"మీ అదృష్టం సంగతి తెలుసుకోవాలనిలేదు నాకు. మీరు అతణ్ణి ఒక్కసారి పిలిపించగలరా? మీపిన్ని ఇప్పుడే అత్యావశ్యకమైన పనిమీద పిలుస్తోందని చెప్పండి" అన్నది.

సంధ్య ఇప్పటివరకు ఒక్కమాటయినా మాట్లాడలా. మెదలకుండా నుంచుని అన్నీ వింటోంది. ఈసారి ఆమె కళ్లెత్తి చూసింది. ఆమెముఖం మరీ వివర్ణమైఉంది. మాట్లాడ బోతే పెదిమలు వణికాయి. కాని తర్వాత ఆమె గట్టిగా - "ఎందుకమ్మా, నువ్వు అతడిని మాటిమాటికీ అవమానం చెయ్యాలని చూస్తావ్? అతడు నీ విషయంలో ఇంత అపరాధం ఏంచేశాడు?" అంది.

జగద్ధాత్రి అత్యాశ్చర్యంతో - "అతడి కవమానం ఎవరు చెయ్యబోతున్నారు సంధ్యా?" అంది.

"ఊహూఁ. నువ్వు అతణ్ణి ఎన్నడూ ఈ ఇంటికి పిలిపించి రప్పించవద్దు" అంది సంధ్య.

"పిలిపించి రెండు మంచి మాటలు చెప్పితా తప్పే?"

"మంచికానీ, చెడుకానీ- అతడీ ఊళ్లో ఉండనీ, లేచి పోనీ-ఇల్లూ వాకిలీ అమ్ముకోనీ- అతడితో మనకేం సంబంధం ఉందని నువ్వు ఇవన్నీ చెప్పదలచుకున్నావ్? నువ్వు అతణ్ణి ఈ ఇంటికి పిలిపించావంటే, నేను చెర్లోదూకి చస్తానని

నీమీద ఒట్టేసుకుని చెబుతున్నా" అని అంటూనే ఆమె తల్లి సమాధానంకోసం ప్రతీక్షించకుండా గబగబా వెళ్ళిపోయింది.

సహించరానంత ఆశ్చర్యంతో జగద్ధాత్రి కళ్లురెండూ ఇంతలింతలు చేసుకుని చూడసాగింది ప్రియముఖర్జీ మాత్రం గట్టిగా అరుస్తూ "పుస్తకం ఇవ్వకుండానే వెళ్లావా, సంధ్యా! టైం మించిపోతోంది. ఒక రెమిడీ సెలెక్టు చెయ్యాలి" అన్నాడు.

సంధ్య వెనక్కి తిరిగివచ్చి చేతిలో పుస్తకం తండ్రి ముందరపెట్టి వెళ్ళిపోయింది. ఆయన అక్కడే కూర్చుని మందును సెలెక్ట్ చెయ్యటంలో మనస్సు లగ్నంచేశాడు.

జగద్ధాత్రి కాస్సేపు మౌనంగా అక్కడే నుంచుని, భర్తను ఉద్దేశించి "మీరింక అమ్మాయికి పెళ్ళిచేయక పోవటమే నిశ్చయించుకున్నారా?" అని అడిగింది.

ప్రియబాబు తనపని తాను చూసుకుంటూనే "చెయ్యకపోవట మేమిటి? తప్పకుండా చేస్తా" అన్నాడు.

"ఎప్పుడు చేస్తారు? చివరకేదో జరిగాక చేస్తారా?"

"హుఁ."

జగద్ధాత్రి ఒక్కక్షణం ఆగి, "రసికపూర్ వెళ్ళి రారాదూ ఒకసారి?" అన్నది.

ప్రియబాబు చూస్తున్న పేజీలో గుర్తుగా వేలుఉంచి ముఖం ఎత్తి, "రసికపూరా? జబ్బు ఎవరికి? ఎవరైనా వచ్చి చెప్పివెళ్లారా ఏమిటి? ఎప్పుడు చెప్పి వెళ్లారు?" అన్నాడు.

జగద్ధాత్రి ఒక్క నిట్టూర్పు విడిచి, "జయరామ ముఖర్జీ మనవుడు ఒకడున్నాడని - సంబంధం ఒకటి తెలిసింది, వెళ్ళి ఒకసారి వరుణ్ణి చూసి రారాదూ ?" అంది.

"కాని ఎప్పుడు వెళ్ళను ! చూస్తున్నావుగా; ఒక్క పూట వెళ్ళకపోతే ఎంత ఉపద్రవం జరిగిందో? అరుణుడి స్థితి అలాఉంది. ఇటుచూస్తే ఛటర్జీగారి ఇంటిదగ్గరనుంచి ఆయన మరదలికి చాలా జబ్బుగా ఉందని కబురువచ్చింది."

జగద్ధాత్రి కొంచెం ఆశ్చర్యపడి "ఎవరికి? జ్ఞానదాకా జబ్బు ! ఆవిడకు మళ్ళీ ఏంజబ్బు చేసింది ?" అని అడిగింది.

"పైత్యం ! పైత్యం ! ఆహార దోషంవల్ల అజీర్ణం ! ఒక్కటే డోకులు ! అరుణ్ దగ్గరకు వెళ్ళివచ్చేప్పుడు అక్కడికికూడా వెళ్లి ఒక్కమాత్ర—"

"వాళ్ళకు మందులిచ్చేందుకు బోలెడంత మంది ఉన్నారు. మీ కాళ్ళమీద పడతా, ఒకసారి రసిక్‌పూర్ వెళ్ళిరండి. వరుణ్ణి ఒకసారి చూసివచ్చి, ఎలాగోఅలా అమ్మాయికి ఉపాయం చెయ్యండి."

భార్య అశ్రురుద్ధ కంఠస్వరం ప్రియబాబును ఎలా అయితే ఏం- మన ప్రకృతిలో పడేసిందికాబోలు! "కాని అతడు ఎప్పుడూ నిషామీద ఉంటాడని విన్నానే-" అన్నాడు.

జగద్ధాత్రి ఇంక ధీరత్వాన్ని నిలబెట్టుకోలేకపోయింది. చటుక్కున ఏడుపు ప్రారంభించి, "నిషామీద ఉంటే ఉండనీండి. ఏమయినా అమ్మాయి మెళ్లో మంగళసూత్రం అంటూ కనపడితే చాలు. మీరుమాత్రం ఎలాంటివారు? మీ చేతిలో

మా అమ్మా నాన్నా నన్ను అప్పగించగాలేంది - మీరేనా అంత పట్టలేంది ?" అన్నది.

అని ఆమె పమిటచెంగుతో కన్నీళ్లు తుడుచుకుంటూ గబగబా వెళ్ళిపోయింది.

ప్రియబాబు నిరుత్తరుడై ఒక్క క్షణంసేపు అలాగే ఉండి తర్వాత చేతిలో పుస్తకం మూసేసి, ఒక్క నిట్టూర్పు విడిచి, "ఇద్దరూ ఇద్దరే సాంఘాతిక రోగులు ఇంట్లో - ఇలా ఇదిచేస్తే రెమెడీ ఎలా సెలెక్టుచెయ్యటం ?" అనుకుని మళ్ళీ ఒక నిట్టూర్పు విడిచి, పుస్తకం చంకనెట్టుకుని మెల్లిగా బైటికి వెళ్ళిపోయాడు.

౮

స్నాన సంధ్యానుష్ఠానాలు యథావిధిగా నిర్వర్తించుకుని, రవంతసాత్త్వికాహారంకూడా తీసుకున్నాక-మూర్తీభవించిన బ్రాహ్మణ్యంలాగా గోలోక ఛటర్జీ మహాశయుడు మెట్లు దిగి వచ్చి- బహుశా వీధిలోకే వెళ్ళిపోదామనుకున్నాడేమో! కాని ఇంతలో హఠాత్తుగా ఏమనుకున్నాడో ఏమో; పక్కనున్న వసారాలోంచి వెనక్కి తిరిగి వంటింటి గుమ్మందగ్గరకు వచ్చి ఆకస్మికమైన ఉద్వేగాన్ని వెళ్ళబుచ్చుతూ, "ఈ పనులన్నీ నీకెంటులకు చెప్పు చిన్నానివిషా! జబ్బుగా ఉన్నప్పుడు ఇంట్లో ఈ అనవసరమైన పనులన్నీ పెట్టుకుని శ్రమ పడుతుంటే ఎంత ఇబ్బంది ? నేను అందుకనే - 'శరీరం ముందా? పనులు ముందా ?' అని అంటూఉంటా" అన్నాడు.

జ్ఞానదా కత్తిపీట ముందరేసుకుని కూరలు తరుగు తున్నది - తరుగుతూనే ఉంది. అతడి కొయ్యపాదుకల - టక టక ధ్వని ఆమె చెవులకెలా అయితే సోకలేదో - అలాగే ఉత్కంఠతో ఆయన బ్రతిమలాడటం కూడా ఆమె చెవి కెక్కలేదు!

గోలోక్ ఒక్కక్షణం ఆగి, "ఏమిటి సంగతి! ఇవాళ ప్రొద్దున ఎలావుంది?" అని అడిగాడు.

జ్ఞానదా ముఖం పైకెత్త లేదు. చేతిలోవున్న బీర కాయకేసి చూస్తూ తలతిప్పుతూ "బాగానేఉంది" అంది.

ఛటర్జీ చాలా సంతృప్తి చెంది, "మంచిది, మంచిది. నాకు తెలియుదూ ప్రియముఖర్జీ పిచ్చివాడైనా—— మందు ఇవ్వటంలో ధన్వంతరి! కాని ఎలా అయితే చెప్పాడో అలా టైం ప్రకారం పుచ్చుకోవాలి. అశ్రద్ధ చెయ్యగూడదు సుమా! ముందే చెబుతున్నాను" అన్నాడు.

జ్ఞానదా యీమాటలకు జవాబేమీ చెప్పలా. తల వంచుకుని తనపని చూచుకోసాగింది.

ఛటర్జీ ఆమె కేసి చూస్తూ కాస్సేపు అలాగే నుంచుని, "ప్రియముఖర్జీకి రెండుపూటలా వచ్చిచూసి వెళ్లా ల్సిందని ప్రత్యేకంగా చెప్పాను - ప్రొద్దున్న వచ్చాడుగా?" అన్నాడు.

జ్ఞానదా అలాగే వంచుకున్న తల తిప్పుతూ "ఆ" అంది.

ఛటర్జీ సంతోషంతో, "ఎందుకురాడు? ఎందుకు రాడు? అతడికి నా మీద చాలాలక్ష్యం. కాని దాసీముండ

ఎక్కడికి పోయింది ? అతనువచ్చి మాంపెచ్చివెళతాను. నువ్వేమో ఇలా పనులు పెట్టుకుని శరీరంపాడుచేసుకుంటూంటే నేనిలా చెయ్యనీయను. వీళ్ళంతా ఎక్కడికిపోయారు - అని అడుగుతా ! ఈ పనులన్నీ ఇలాగే ఉండనీ, వెళ్ళు - పైకి వెళ్ళి కొంచెం విశ్రాంతి తీసుకో. మధుసూదనా నీవేగతి" అని అతడు స్వ పర - లౌకిక పారలౌకికాలనే ఉభయకర్తవ్యాలూ పూర్తిచేసుకుని బైటికి వెళ్ళబోతున్నాడు.

అతడి పాదుకలు కదలిన చప్పుడుకు చకితురాలై ఇంతసేపటికి ఆమె ముఖమెత్తి చూసింది. ఆమె ముఖంలో ప్రసన్నపూర్వకమైన ఆనాటి చిరునవ్వు లేదిప్పుడు. ఈనాడా ముఖాన్ని చింతా విషాద మేఘాలు ఆవరించుకున్నాయి. కళ్ళు రెండూ ఎర్రగా జ్యోతుల్లా ఉన్నాయి. కనురెప్పల అంచున అశ్రుబిందువులు ఇంకా ఉన్నట్లే ఉన్నాయి. అలాంటి సజలదృష్టిని ఛటర్జీమీద కొంతసేపు నిలిపి, రుద్ధ కంఠంతో హఠాత్తుగా "మీరు ప్రియబాబుగారి కూతురు సంధ్యను పెళ్ళిచేసుకుందా మనుకుంటున్నారా ? నన్ను మోసగించకండి. నిజం చెప్పండి ?" అని ప్రశ్నించింది జ్ఞానదా.

ఛటర్జీ నీళ్ళు నములుతూ సమాధానం చెప్పలేక పోయాడు. కాని మరుక్షణంలోనే "నేనా ! సంధ్యనా ? లేదే ! ఎవరు చెప్పారు ?" అన్నాడు.

"ఎవరైనా చెప్పనీయండి. రాసుదీదీని మీరు వాళ్ళమ్మ దగ్గిరకు పంపారుటగా ? వచ్చే మార్గశిరమాసంలో

ముహూర్తం ఏర్పాటయింది కదూ? భగవంతుడిమీద ఒట్టేసుకుని నిజం చెప్పండి !"

గోలోక్ తర్జని చూపుతూ అస్ఫుటంగా పళ్ళుకొరుకుతూ; "రాసమణి చెప్పిపోయిందా ? సరేచూస్తా దాని సంగతి ! నేను—"

"అయితే మీకు నన్నెందుకు ఇలా నాశనంచేశారు ? ముఖం చూపించటానికిగాని, - ఎక్కడా నిలవటానికైనా ఆస్కారం లేకుండాపోయిందే నాకు -" అని అంటూండగానే జ్ఞానదా కంఠం బొంగురుపోయింది. ఆమె హృదయం ఏడుపుతో వెయ్యి వ్రక్కలయింది.

ఛటర్జీ గాబరాపడి నాలుగువైపులా భయంతో తేరిపారచూస్తూ, చేతితో నోరు అణచుకుని, "అరే !అదేమిటి? అదేమిటి! నలుగురూ వినిపోతారు సుమా ! అబద్ధం, అబద్ధం, ఒట్టి అబద్ధం ! తమాషా—"

జ్ఞానదా ఏడుస్తూ ఏడుస్తూ "కాదు, తమాషా ఎప్పటికీ కాదు. అబద్ధమేమాత్రంకాదు. ఇది నిజమే. అక్షరాలా నిజం ! మీరేదయినా చేయగలరు, మీకు అసాధ్యమైన పని ఏదీ లేదు" అంది.

"కాదు, కాదు - చెప్పానుగా తమాషా అని - తాతా మనుమరాలి సరాగం ఇది - ఆఁ. ఊరుకో. దాసీలువాళ్ళు వచ్చిపడతారు" అంటూ గోలోకఛటర్జీ మహాశయుడు, పాదుకలను టకటక చప్పుడు చేసుకుంటూ గాభరాపడి వీధిలోకి పారిపోయాడు.

జ్ఞానదా చేతిలో బీరకాయ చేతిలోనే ఉంది. ఆమె నోట్లో పమిటచెంగు కుక్కుకుని ఏడుపును ఎలాగయితేయేం ఆపుకుంటోంది. ఇంతలో ఇంట్లోఉన్నదాసీది రోజుకుంటూ పరుగెత్తుకువచ్చి, "చిన్నమ్మగారూ! దాసీదాన్ని వెంటబెట్టుకుని గుడ్డితాతయ్యగారే స్వయంగా వచ్చేశారమ్మా," అంది.

జ్ఞానదా చప్పున కళ్లు తుడుచుకుని జిజ్ఞాసాదృష్టితో చూసింది. అశ్రుకలుషితమైన ఆమె వ్యధిత దృష్టికి ఎదురుగా ఉన్న దాసీది ఆశ్చర్యపడి, కొంచెం సిగ్గుతో - "మీ ఆ పాత దాసీదాన్ని వెంటబెట్టుకొని మీ మామగారు వచ్చారమ్మా! అలా ఉన్నారేం?" అంది.

ఈమాట వినేసరికి జ్ఞానదా ముఖంలో ఒక్కచుక్కైనా నెత్తురు లేకుండా పోయింది. ముఖాముఖిని మృత్యువును చూసినా ఎవరి ముఖమూ ఇంతగా పాలిపోదు.

దాసీది భయపడుతూ "అలా ఉన్నారేం చిన్నమ్మగారూ?" అంది.

జ్ఞానదా దీనికికూడా జవాబివ్వలేదు, కేవలం విహ్వల శూన్యదృష్టితో చూస్తూ ఉండిపోయింది.

"మీ కేమయినా సుస్తీగాఉందా అమ్మగారూ?" అని మళ్ళీ ప్రశ్నించింది దాసీది.

జ్ఞానదా ఈసారి తలఊగిస్తూ "ఆఁ. వారు వచ్చి ఎంతసేపయింది కాళీ?" అని అడిగింది.

"అది నాకు తెలియదు అమ్మగారూ ! ఆయనగారు ముందర వాకిట్లో నిలబడి బాబుగారితో మాట్లాడుతూంటే ఇప్పుడే చూశాను."

జ్ఞానదా ఆశ్చర్యపడుతూ "బాబుగారితోనా ?" అని అడిగింది.

"ఆఁ, నేను వీధిలోంచి వస్తూంటే బాబుగారు నన్ను పిలిచి, 'కాళీ, మీ చిన్నమ్మగారితో ఆమె మామగారు ఆమెను తీసుకువెళ్ళటానికి వచ్చారని చెప్పు' అన్నారు. అరు గోనమ్మా, ఆయనే స్వయంగా వచ్చేస్తున్నారు" అని దాసీది కొంచెం పక్కకు జరిగినుంచుంది. మరుక్షణంలోనే కఱ్ఱ పొడుచుకుంటూ వచ్చేవారెవరో ఆ చప్పుడునుబట్టి గ్రహించింది. ఆ కఱ్ఱ తాటించుకుంటూ వచ్చేవారు రాకపోకలకు కంటిమీదకన్న కఱ్ఱమీదే ఎక్కువ ఆధారపడి ఉంటారు.

మరు నిమిషంలోనే నడివయస్సులోఉన్న ఒక దాసీ, దాని వెనకాల ఒక వృద్ధవ్యక్తి కఱ్ఱ తాటించుకుంటూ వచ్చి, "మా అమ్మ ఎక్కడుంది ?" అని అడిగాడు.

జ్ఞానదా లేచి గళవస్త్రయై ఆయన పాదాలకు నమస్కరించి, లేచి నుంచుంది. ఆ వృద్ధుడు చూడలేకపోయినా లీలగా ముఖాన్ని గుర్తించగలిగాడు. ఆయన ఆశీర్వదించబోయి కంట తడిపెట్టుకొని, "ముసలివాళ్ళని మమ్మల్నిద్దరిని ఎలా మరచిపోయి వచ్చావు అమ్మా ?" అన్నాడు.

వెంట వచ్చిన దాసీది కాళ్ళమీదపడి నమస్కరించి, "అది నిజమే తల్లీ ! మీ ముసలి అత్తగారు చావుకు సిద్ధమై ఉన్నారు. ఆమె నోటినుంచీ ఎప్పుడు చూచినా 'మా కోడల్ని

తీసుకురండి, కోడల్ని తీసుకువచ్చి చూపించండీ !' అన్న మాట ఒక్కటే. ఇన్నాళ్ళూ వారిని ఎలా మరచిపోయి ఉన్నారు చెప్పండి ?" అని అన్నది.

జ్ఞానదా ఈ అభియోగానికి జవాబేమీ ఇవ్వలేక పోయింది. ఒక చేత్తో కళ్ళు తుడుచుకుంటూ, రెండో చేత్తో ఆయన్ని పట్టుకుని వసారాలోకి తీసుకువచ్చి, పీటవేసి కూర్చోబెట్టి, తలవంచుకుని మౌనంగా నుంచుంది.

వృద్ధుడు ఉపవిష్టుడై, "భటర్జీగారికి రెండు ఉత్తరాలు వ్రాయించాను. కాని ఒక్క దానికీ జవాబురాలా నాకు. ఆయన చాలా గొప్పవాడు. బోలెడన్ని పనులాయనకి. మన లాంటి బీదవాళ్ళకు ఉత్తరం రాయాలన్నమాట ఆయనకు జ్ఞాపకం ఉండదనుకున్నా. కాని మాతల్లే, మా దరిద్ర గృహానికి లక్ష్మి—" అని చెప్పసాగాడు.

వెంట వచ్చిన దాసీది మాట మధ్యలోనే అందుకుని చెప్పసాగింది: "మీ బావగారు గొప్పవారైతే అవచ్చు. అలా అని పరాయి ఇంటి కోడల్ని ఎన్నాళ్ళని తీసుకువచ్చి ఇంట్లో అట్టేపెట్టుకుంటారమ్మా ? అదీగాక ఎవరి ఉపకారం చెయ్యాలని వచ్చారో, ఆ అప్పగారు కాస్తా చనిపోయాక, నేను అంటున్న దేమిటంటే—"

వృద్ధుడామాటకు అడ్డువచ్చి, "ఆగు సదూ ! ఆమాటలన్నీ అలా ఉంచు. అమ్మాయీ, నీ అత్తగారు చాలా జబ్బుగా ఉందమ్మా ! ఇవాళ మంచిరోజు— అనిచెప్పి, నిన్నొకసారి తీసుకురమ్మని ఆమె పంపింది—" అన్నాడు.

"మీకోసమే ఆమె ప్రాణాలింకా పోకుండా ఉన్నాయి అమ్మగారూ! ఆమె కొన్నాళ్ళనుంచీ-నాతో 'సరూ, మా అమ్మ, నువ్వైనా వెళ్ళి ఒక్కసారి తీసుకురావే. తీసుకువచ్చి నాకోసారి చూపించవే-'అని చెబుతోంది-"అని అంటూండగానే దానికంతం దుఃఖంతో ఆర్ద్రమైపోయింది.

"ఛటర్జీగారికి నా ఉత్తరాలు రెండూ అందలేదన్న సంగతి నాకు తెలియదు. మేమెన్నెన్ని విధాలో ఆలోచించాం; ఎంతో ఆదుర్దాపడ్డాం. ఆయన చాలాగొప్పవాడు; ఎంతో యోగ్యుడు. వినగానే - 'ఎంతమాట? మీ కోడలిని మీరు తీసుకువెడతానంటే ఎవరు అభ్యంతర పెడతారు?' పైగా వెంటనే మేనాకీ, బోయీలకు కబురంపారు. మీ అత్తగారికి జబ్బుగా ఉందనివిని, పాపం చాలా ఇదయి-'నాకు కష్టకాలంలో మీరు జ్ఞానదాని పంపారు. ఇప్పుడు మీకు కష్టమొస్తే, ఆమెని తిరిగి పంపటానికి వీల్లేదనే పాపండు డెవడుంటాడు? ఇప్పుడే తీసుకెళ్ళండి. నేను అన్నీ ఏర్పాట్లూ చేస్తా' నన్నారు" అన్నాడు వృద్ధుడు.

జ్ఞానదా ఇంతసేపటివరకు మాట్లాడకుండా కూచుంది. హఠాత్తుగా ఆమెముఖం విషణ్ణమయింది. "ఛటర్జీగారే అన్నారా ఈ మాట? ఇప్పుడే పంపుతారా? ... వాళ్ళేనా!" అన్నది. సౌదామిని ఉత్సాహంతో "ఆఁ అన్నారు. అనక పోవటమేమిటి? పైగా - 'ఇప్పుడే భోజనాలూ అవీ కానిచ్చుకునిబయలుదేరి మూడుగంటలబండి అందుకుంటే రేపు ఉదయానికల్లా ఇంటికి చేరుకోవచ్చు'-అనికూడా అన్నారు. అదీగాక ఇంటిదగ్గర చావుబ్రతుకులమీద ఉన్నరోగి ఆయెను!

ఎక్కడన్నా ఒక్క పూట ఆలస్యం చేయటానికి వీలుంటుందా అమ్మగారూ! పాపం ముసలావిడ కళ్ళన్నీ మీమీద పెట్టుకుని మీకోసం ఎదురుచూస్తూ ఉంటుంది" అన్నది.

జ్ఞానదా కేవలం మరబొమ్మలాగా తాను మొదట అన్నమాటలనే-"వారు పంపిస్తామన్నారా? ఇప్పుడేనా?" అని ఆవృత్తిచేసింది.

వృద్ధుడు తలతిప్పుతూ "అవును తల్లీ, ఇప్పుడు కాక పోవటమేమిటి? ఆ గేందుకు అవకాశంలేదు" అన్నాడు.

కాని సౌదామిని విసుక్కుంది. అది దాని కంఠ స్వరంలో వ్యక్తంకాకపోలేదు. "వినండి ఈ మాట! అత్త గారు చావటానికి సిద్ధంగా ఉంది. ఎవరికోడలిని వారు స్వయంగా తీసుకు వెళ్ళటానికి వచ్చినప్పుడు పంపనని చారెవరో చెప్పండి? అదిగాక ఇంకా ఇక్కడ ఉండటం మాత్రం ఎందుకు? సరేపోనీ మీ బావగారినే పిలిచి అడగరాదా ఒక సారి అమ్మగారూ?" అంది.

కాని పిలవనవసరం లేకపోయింది. ఆ ప్రక్కనే ఎక్కడో అయన నుంచుని చూస్తున్నాడు కాబోలు, పావు కోళ్ళ చప్పుడు చేసుకుంటూ ప్రత్యక్షమయ్యాడు. చాలా గడబిడగా ఉన్నాడు. వృద్ధుణ్ణి ఉద్దేశించి "కూర్చుని కబుర్లు చెప్పుకుంటూంటే కాదు ముఖర్జీగారూ! టైమయిపోతోంది. స్నానం, సంధ్య పూర్తిచేసుకుని భోజనం చేసుకుని కాస్త విశ్రాంతిగా ఊపిరితీసుకునేసరికి టైం అవనే అవుతుంది. ఆ తర్వాత మళ్ళీ వర్షం వస్తుంది. సరిపాయె! సంకటానికి అభ్యంతరమా? మాకు కొంచెం ఇబ్బందే అంటే అవు

తుంది! అలాఅని- అదేమన్నమాట? అత్తగారు పాపం అంత జబ్బులో ఉన్నారాయె! నాకేనో లక్ష జంజాటాలు. జ్ఞానదాను తీసుకువచ్చి దింపివచ్చేవాడిని! ఒక్క ఉత్తరం ముక్కయినా అందిందా? అలా అందినట్లయితే మీకింత శ్రమ కలిగించాల్సి వచ్చేదేకాదు. పోస్టుప్యూనులంతా ఒక్కసెధవలై పోయారు-కాళీ, ఎక్కడకెళ్ళింది? 'భోలూ' ఎక్కడికి పోయాడు? కానీయండి ముఖర్జీగారూ! ఇక ఆలస్యం చెయ్యకండి. లేవండి. జ్ఞానదా, కొంచెం తొందరచెయ్యి; మళ్ళీ మూడుగంటలబండి అందుకోవాలి! ఆఁ, మళ్ళీవచ్చి కూర్చున్నాడు మణేదారు! మా ఆవిడ పోయిందగ్గర్నుంచీ అదేమిటో కాని ముఖర్జీ మహాశయా, మనస్సు మనస్సులో ఉండటంలేదు. మధుసూదనా! నీవేగతి!" అంటూ గోలోక ఛటర్జీ వచ్చినదారినే మళ్ళీ కొయ్యపాంకోళ్ళ చప్పుడు చేసుకుంటూ బైటికివెళ్ళిపోయాడు.

జ్ఞానదా ఒక్క మాటకూడా జవాబు చెప్పలా. అలాగే అతడు వెళ్ళిన దారికేసి చూస్తూ శిలావిగ్రహంలా నిలబడిపోయింది.

భోలూవచ్చి "అమ్మగారూ! చిన్నబాబు స్నానం చేస్తానని వెదుస్తున్నారు. ఒక్కసారి నదికి తీసుకువెళ్ళిరానా?" అన్నాడు.

జ్ఞానదా అలాగే నిశ్చలంగా నుంచుని ఉంది. భృత్యుడి విజ్ఞప్తి ఆమె చెవికెక్కినట్లులేదు.

వృద్ధుడైన మామగారు మెల్లిగా లేచి నుంచుని, "అమ్మాయీ, నేను లేచి బైటికి వెడుతున్నా. కాని నువ్వు కూడా ప్రయాణానికి సిద్ధంగా ఉండు" అన్నాడు.

"నాకివాళ షష్ఠి అమ్మా! ఈ పూట నేను భోజనం చెయ్యను!" అన్నది సౌదామిని.

జ్ఞానదా చటుక్కున వెనక్కి తిరిగి నుంచుని "నేను రాను" అంది.

వృద్ధుడు ఉలిక్కిపడి, "రావూ? ఎందుకని అమ్మా! ఇవాళ చాలా మంచిరోజు" అన్నాడు.

సౌదామిని తన 'షష్ఠి' ఫలహారం సంగతి మరచి పోయింది. "మేము భట్టాచార్యులవారి దగ్గరకెళ్ళి మంచి రోజు చూసుకునే మరీ బయలుదేరి వచ్చాము అమ్మగారూ!" అంది.

"నేను రానండీ! నేను రాలేను" అని మాత్రం అంది జ్ఞానదా. గోలోకచటర్జీ కొడుకు పదేళ్ళవాడు పరుగెత్తు కుంటూవచ్చి, ఆమెమీదపడి, "పిన్నీ! నువ్వు తీసుకెళ్ళమని చెప్పవూ! నేను నదిలో స్నానం చెయ్యటానికి వెడతా. ఊఁ, వెడతా" అన్నాడు.

జ్ఞానదా ఎవరికీ సమాధానం చెప్పలా. ఆ తల్లిలేని కుర్ర వాణ్ణి గట్టిగా హృదయానికి హత్తుకుని 'హుఁ హుఁ' అంటూ ఏడవటం మొదలెట్టింది.

౭౦

ఆ తర్వాత జ్ఞానదా ఏ గదిలోకి వెళ్ళి లోపల తలుపు బిగించుకుని కూర్చుందో; ఆ గదితలుపులు మళ్ళీ తెరవలేదు. అంధుడైన ఆవృద్ధశ్వశుర మహాశయుడు మధ్యాహ్నంవరకూ మతిపోయినవాడిలాగా మౌనంగా అలాగే కూర్చుని, తరువాత మెల్లిగా లేచి వీధిలోకి వెళ్ళిపోయాడు. అతడివెంట సౌదామిని కూడా వెళ్ళింది. తలవని తలంపుగా - ఆమె ఇలా రాననటానికి కారణమేమిటో అదీ తెలుసుకోలేకపోయింది. కాని ఆడది కనుక - ఇలా మొదలకుండా ఆమె ఊరికే తిరిగి వెళ్ళలేకపోయింది. వెళ్ళేముందు జ్ఞానదా ఉన్న గదిబైట నుంచుని అది అనివెళ్ళిన మాటలు అందమైనవీ కావు; మధురమైనవీ కావు. కాని ఏ మాటకీ జ్ఞానదా ఎలాంటి సమాధానమూ ఇవ్వలా. ఆమె ఏడుస్తున్న ధ్వనికూడా ఏమాత్రమూ బైటికి రానీయలా. చిన్నతనంలో భర్త పోయినప్పటినుంచీ ఈ అత్తగారే ఆమెను కడుపులో పెట్టుకుని పెంచి, పెద్దదాన్ని చేసింది. ఏరోజునా ఇంత కష్టం కలిగించి ఎరగదు. ఈనాడు ఆమె మృత్యుశయ్యమీద ఉంది. కేవలం తన ముఖం చూశాకకాని ఆమెకు ప్రాణాలు పోయేట్లుగా లేవు. అదీకాక అశక్తుడూ, అంధుడూ అయిన ఆమె మామగారు వచ్చి రిక్తహస్తాలతో తిరిగి వెళ్ళిపోయాడు. ఇలాంటి స్థితిలో ఇంతటి బాధనంతా తలుపు మూసుకుని ఆ గదిలో కూర్చుని ఒంటరిగా ఎలా భరించగలిగిందో; ఆ విషయం జగదీశ్వరుడికే తెలియాలి. అతడుతప్ప మరోసాక్షి ఎవరూ లేరు.

వృద్ధుడు వెళ్ళిపోయేముందు గోలోక ఛటర్జీ వెళ్ళి ఆయనకు కనిపించి రాకపోకలకయిన ఖర్చులు ఇస్తానన్నాడు సవినయంగా. జ్ఞానదా రాకపోవడంవల్ల ఆతడు చూపించిన విస్మయం, ఆవేదన - వృద్ధుడికి కలిగిన ఆశ్చర్య వేదనల్ని కూడా అతిక్రమించాయి.

ఛటర్జీ వీధిసావిట్లోకి వచ్చి చూసేసరికి మృత్యుంజయ భట్టాచార్యులు వచ్చి కూర్చుని ఉన్నాడు. అతడు లేచి నమస్కరించాడు.

ఛటర్జీ మళ్ళీ నమస్కరించకుండానే, తల కొంచెం ఊగించి, "మిమ్మల్ని రమ్మని కబురు పంపాను" అన్నాడు.

"చిత్తం! వినగానే రెండు మెతుకులు నోట్లో వేసుకుని పరుగెత్తుకుంటూ వచ్చాను-మహాశయా!"

"అలాగే వచ్చావులే! సరేకాని మీరు సంబంధాలు కుదర్చటానికంటూ బయలుదేరి, దేశదేశాలూ తిరుగుతారే; అప్పుడు తెలుసుకున్న సంగతులన్నీ జాగ్రత్తగా ఉంచుతారా! ఆం, ఘటికుడంటే- నిజంగా మీ తాతనే చెప్పాలోయ్! రామతారణ శిరోమణి, సంఘం యావత్తూ ఆయనకు నఖ దర్పణంలో ఉండేది."

"చిత్తం, నా అపరాధం మాత్రం ఏమిటి? ఇవన్నీ ఆడవాళ్ళు చేసేపనులా? సరే అదలా ఉంచండి - జగద్ధాత్రి కుమార్తెకు ఎంత అహంకారమో చూడండి, ఛటర్జీ మహాశయా! రాసమణి పిన్నిదగ్గర విన్నప్పటినుంచీ నాకు కోపం మండిపోతోంది"

ఛటర్జీ చాలా ఆశ్చర్యంతో "ఏమిటేమిటి? సంగతేమిటో చెప్పు" అన్నాడు.

"మీరేమీ వినలేదా?"

"లేదులేదు, ఏమీ వినలేదు. ఏం జరిగిందేమిటి?"

"మీ ఇల్లు ఇప్పుడు శూన్యంగా ఉంది. ఆపిల్లకా ఇంకా పెళ్లి కాలేదాయె. మీరు దయతలచి మూడుముళ్లూ వేసి, బ్రాహ్మణ కులం రక్షించాలని అనుకున్నారని విన్నాను. ఆ కుర్రది అందరితోనూ చెబుతోందిట — ఆ మాట నా నోటి మీదుగా ఉచ్చరించాలన్నా కష్టంగా ఉంది. ఆ చచ్చినవాడి మెడలో చిరుగుచెప్పులదండ వేస్తా-నన్నదట! తల్లీ తండ్రీ ఆమెతో ఏకమయినారట!"

గోలోక ఛటర్జీ ముఖం, కళ్ళూ కోపంతో ఎర్రపడ్డాయి. కాని ఒక్క నిమిషంలో అతడు తనను తాను సంబాళించుకుని వెర్రినవ్వు నవ్వి, "అది ఒట్టి అతివాగుడు మనిషి" అన్నాడు.

మృత్యుంజయుడు కూడా కోపం తెచ్చుకుని "అయితే అవచ్చు. కాని అలా అని మిమ్మల్నైనా ఇంతమాట అనటం! మీ పాదాల్ని పూజిస్తే తనతాత ముత్తాతలంతా తరిస్తారని ఎరుగదు కాబోలు! ఏమంటారు?" అన్నాడు.

ఛటర్జీ ప్రశాంతంగా నవ్వుతూ, "చిన్నపిల్ల! పసిపిల్ల! కోప్పడకూడదు మృత్యుంజయా! కోప్పడకూడదు! నా మర్యాద దానికేం తెలుసు? మీరంతా ఎరుగుదురు. పది ఊళ్ళవాళ్లు ఎరుగుదురు!" అన్నాడు.

మృత్యుంజయుడు కంఠస్వరాన్ని ఎలాగోఅలా తగ్గించి "అయితే ఆ సంగతి నిజమేనా ! మీరు రాసపిన్ని ద్వారా-"

"రామ రామ ! నీకుకూడా యేమయినా పిచ్చా యేమోయ్ ! గృహలక్ష్మిలాంటి భార్య పోనేపోయింది - మళ్ళీ-" అని హఠాత్తుగా దీర్ఘంగానిట్టూర్చి "మధుసూదనా! నీవే శరణు !" అని భక్తి గద్గదమయిన తన నిట్టూర్పుకు భట్టాచార్య లేమంటాడో తోచక అతడి ముఖంకేసిచూస్తూ ఊరుకున్నాడు ఛటర్జీ.

అలా కొంతసేపు గడిచాక ఉదాసీన కంఠంతో —

"ఈ చెత్తవిషయాలన్నీ నా మనస్సు కేమాత్రం ఎక్కవసలు. వాళ్ళూ వీళ్ళూ వచ్చి 'వాళ్ళను బ్రతికించండి. వీళ్ళను రక్షించండి, వారి వంశాన్ని ఉద్ధరించండి' అంటూ రాత్రింబగళ్ళు వేధించుకుతింటున్నారు నన్ను. నేను మొదటి నుంచీ కేవలం ఉదాసీనుణ్ణని నువ్వూ ఎరుగుదువుగా ! బహుశా ఒకవేళ పొరపాటున ఎవరితోనైనా అంటే అన్నా నేమో-మధుసూదన ! నీవే శరణు ! నీవే గతి !" అన్నాడు.

ఘటికుడైన మృత్యుంజయ భట్టాచార్యులు అసలు విషయం పట్టేశాడు. సవినయంగా "చిత్తం, అలా అయితే మా ప్రాణకృష్ణ ముఖర్జీ కుమార్తెకు తమ పాదాలచెంత కాస్త చోటు ఇప్పించండి. బీదబ్రాహ్మడు. పిల్లకు కూడా పదమూడు పధ్నాలుగేళ్లుంటాయి. చాలా అందగత్తె. లక్ష్మి లాంటి పిల్ల అనుకోండి" అన్నాడు.

"నువ్వు ఒట్టి పిచ్చివాడవోయ్ ! ఇప్పుడిలాంటివన్నీ బావుంటాయా నాకు ? అయితే ఆ పిల్లకీమధ్య పధ్నాలుగో

యేమకూడా వచ్చిందా? అవును, కొంచెం బొద్దుగా వుంటుం దనికూడా విన్నాను."

భట్టాచార్యులు ఉత్సాహం తెచ్చుకొని, "చిత్తం, అవునవును. అదీకాక ఎంత నిదానంకలదో, అంత అందగత్తె కూడా" అన్నాడు.

గోలోక్ చిరునవ్వు నవ్వి, "ఆఁ, నాకింకా అందగత్తెలు! కేవలం లక్ష్మీవిగ్రహాన్నే పొగొట్టుకున్నాగదా! మధుసూదనా! ఎవరి దుఃఖాన్నీ సహించలేను. వింటే దుఃఖాన్ని ఆపుకోనూలేను. పదమూడు పధ్నాలు గెళ్ళుంటాయి-అని ఎప్పుడయితే అన్నావో అప్పుడింక పదిహేను పదహారుంటాయి అని అనుకోవచ్చుకూడా. బ్రాహ్మడు పాపం చిక్కుల్లో పడ్డాడని చెబుదూ!"

అతడు తలతిప్పుతూ "దానికింక సందేహమా?" అన్నాడు.

"నాకన్నీ తెలుసు మృత్యుంజయా! కులీనుడికి కులం నిలబెట్టడం కులీనుడి విధి. నిలబెట్టకపోవటమనేది చాలా దోషం. కాని ఏమిటంటే; అసలే శోకతప్తమైన శరీరం-వయస్సుకూడా యాభై దగ్గరకొచ్చి పడ్డాయి - కాని ఇదేం స్వభావమో ఇతరులకు ఆపదకలిగిందని వింటే నా ప్రాణాలు విలవిలలాడుతాయి-'కాదు' అని అనలేను"

మృత్యుంజయ భట్టాచార్యులు మాటిమాటికీ తల తిప్పటం మొదలెట్టాడు. గోలోక్ మళ్ళీ దీర్ఘనిశ్వాసవదిలి, "ఇలాంటి కులీనులుండే గ్రామంలో సంఘానికి శిరోమణినవటం అనేది ఎంతకష్టమో అది నాకుతెలుసు. ఎవరికి తిండిలేనో-

ఎవరికి గుడ్డల్లేవో; ఎవరికి వైద్యంలేదో ఇవన్నీ తెలుసుకోవటం అలా ఉండగా ఆపైన ఇలాంటివన్నీ కూడా వచ్చి మీదపడితే నేనింక బ్రతకలేను మృత్యుంజయా! ప్రాణకృష్ణుడు బీద బ్రాహ్మడు - అతడి మనాతురు పెద్దదయిందా! పదమూడు పద్నాలుగేమిటి-పదిహేను-పదహారుకు ఏమాత్రం తక్కువ ఉండవు. అయితే ప్రాణకృష్ణ ముఖర్జీని నన్ను చూడమని చెప్పకపోనూవా ఒకసారి?" అన్నాడు.

మృత్యుంజయుడు గాభరాపడి "ఇప్పుడే వెళ్ళి పంపిస్తా. లేకపోతే వెంటబెట్టుకు రమ్మంటే అలాగేవస్తా" అన్నాడు.

గోలోక్ ఉదాసీన కంఠంతో "అలాగే తీసుకురా, కాని చాలా విపత్తులో పడేశావు మృత్యుంజయా! బీద బ్రాహ్మడికింత ఆపద సంభవిస్తే కాదని ఎలా అనను? మధుసూదనా! 'త్వయా హృషీకేశ హృది స్థితేన' నీవేది చేయిస్తుంటే అదే చేయాలి. మేము కేవలం నిమిత్తమాత్రులంకదా!" అన్నాడు.

మృత్యుంజయుడు మెదలకుండా ఊరుకున్నాడు.

గోలోక్ ఛటర్జీకి హఠాత్తుగా ఏదో జ్ఞాపకం వచ్చి "ఆఁ, చూడు! నిన్నెందుకు పిలిపించానో; ఆసంగతి చెప్పనే లేదు. చెబుతున్నానుగా; ఈ నెల చాలా కటాకటిగా ఉంది. నీ వడ్డీబాపతు డబ్బు..."

మృత్యుంజయుడు కరుణ స్వరంతో "ఈ నెల్లో కాస్త దయ ఉంచినట్లయితే..."

"సరే. సరే. అలా గేలే. నేను ఇబ్బందిపెట్టి ఒక్క దమ్మిడీ అయినా రాబట్టుకోను. కాని నువ్వు నాకు ఓపని చేసి పెట్టాలి"

మృత్యుంజయుడు సంతోషంతో "చిత్తం అజ్ఞాపించండి." అన్నాడు.

"సనాతన హిందూ ధర్మాన్ని నిలిపి సంఘాన్ని రక్షిస్తూ రావటమనేది అంతసులభమైన పనికాదు, మృత్యుంజయా! ఈ మహాభారం ఎవరి నెత్తిమీద ఉంటుందో వారు అన్ని వైపులా కళ్ళు పెట్టుకు చూడాలి. చెవులు పెట్టుకు వినాలి! ప్రియముఖర్జీ తల్లి విషయంలో ఏదో గందరగోళం జరిగిఉందని విన్నాను. నువ్వు ఆ ఊరు వెళ్ళి ఈ విషయం అతి రహస్యంగా తెలుసుకురావాలి. మీ తాతగారుండే వాడే శిరోమణి మహాశయుడు; ఈ విషయాల్లో సిద్ధహస్తుడు. ఆయనకిరవై మైళ్ళ ఊళ్ళ విషయాలన్నీ కంఠస్థమే-భూపతి చటర్జీ ఇంటికి పదేళ్ళపాటు మంగళ్ళను చాకళ్ళను వెళ్ళనీయకుండా చేశాను. వారి ఇంట్లో హుక్కా ఎవర్నీ తాగకుండా చేశాను. ఆ భాయీ సాహెబ్ 'బాబోయ్' అనుకుంటూ సగం చచ్చి ఈ ఊరు వదిలిపెట్టిపోయాడు - మీ తాతగారి సహాయం మూలంగానే అలాచేశాను. కాని నువ్వు ఆయన ప్రతిష్ఠను నిలబెట్టలేక పోయావన్న సంగతి-చెప్పక తప్పదు"

మృత్యుంజయుడు తన పూర్వీకులతో సరితూగలేక పోయిన అసమర్థతకు నొచ్చుకుని సిగ్గుపడ్డాడు. "మీరు చూడండి ఛటర్జీమహాశయా!- నేను ఒక్కవారం రోజుల్లో

వాళ్ళ కడుపుల్లో దాచుకున్న విషయాల్ని బైటికిలాగి తెలుసుకుని వస్తాను." అన్నాడు.

ఛటర్జీ ఉత్సాహాన్ని కలిగిస్తూ, "ఆఁ, నువ్వు తెలుసుకు రాగలవు. నువ్వు అసలు గొప్పఇంటి బిడ్డవోయ్ ! కాని చూడు నాయనా ! ఈ విషయం ఇంక మూడో చెవిని పడనీయాల్సినంత అవసరంలేదు — ఈ సంగతి నీ నా మధ్యనే ఉండాలి. సంఘంతాలూకు మానమర్యాదలు నిలబెట్టాలంటే ఎంతో వివేచన అవసరం. అయితేచూడు; కేవలం వడ్డీఅన్న మాటేమిటి ? అసల్లోకూడా నేను శాస్త్ర ఆలోచించి చూస్తాలే, కష్టాల్లో ఉన్నావు. ఈ సంగతి కొంచెం ముందుగానే నాకు తెలియచేసినట్లయి తే—"

మృత్యుంజయుడు పులకితుడై లేచినిలబడి, "తమ చిత్తం, తమదయ ! మేము మీ పాదాల్ని నమ్ముకుని పడి ఉన్నవాళ్ళం. ఈ సంగతి ఆచూకీ తీసుకురావటానికి నేను రేపు ఉదయమే వెడతా" అని అతడు వెళ్ళబోయినాడు.

గోలోక ఛటర్జీ ఆమాటకు నాలిక కొరుక్కుని, "అలాంటిమాటలు నాలిక చివరికైనా రానీయకు బాబూ ! నేను కేవలం నిమిత్తమాత్రుణ్ణి, ఆ పరమాత్ముని శ్రీచరణ సన్నిధిని పడిఉండే కోటానుకోట్ల జీవరాసుల్లో నేనొకణ్ణి !" అని ఆయన ఊర్ధ్వదిశకు శివదృష్టిని మరలిచి చేతులు జోడించి నమస్కరించాడు.

మృత్యుంజయుడు మళ్ళీ వెళ్ళబోతుండగా, గోలోక్ పరధ్యానంతో — "ఇదిగో చూడు ! ప్రాణకృష్ణుని ఒకసారి పంపించటం మరచిపోకు సుమా ! బ్రాహ్మణుడు ఆపదలో

ఉన్నాడని చెప్పినప్పటినుంచీ నా ప్రాణాలు విలవిలాడు తున్నాయి. నారాయణ ! మధుసూదనా ! నీవేశరణు."

## ౧౦

సుప్రసిద్ధుడైన జయరామ ముఖర్జీగారి దౌహిత్రుడు చిరంజీవి వీరచంద్ర బెనర్జీకే సంధ్యను ఇచ్చి వివాహం జరప టానికి నిశ్చయమయింది. పెండ్లికొడుకు తరఫువారు తాంబూ లాలు పుచ్చుకోటానికి వస్తారు రేపు. దానికి తగిన ఏర్పా ట్లన్నీ జరుగుతున్నాయి ఇంటిదగ్గర. మార్గశిర బహుళంలో ఒక్కటే ఉంది లగ్నం. ఆతర్వాత మూడునెల్లదాకా ఒకటే మూఢమి. ఎన్నిసార్లు ప్రాధేయపడినా, బ్రతిమాలినా రాని జగద్ధాత్రి అత్తగారు ఈ పెళ్ళికోసమని కాశీనుంచి వచ్చింది. చీకటిపడ్డాక వంటింటి వసారాలో దీపందగ్గర కూర్చుని, జగ ద్ధాత్రి పిండివంట చేస్తోంది. ఆమెకు దగ్గరలోనే ముసలి అత్తగారు చిత్రాసనంమీద కూర్చుని జపమాల త్రిప్పు తోంది. చలికాలం ప్రారంభమయినట్లు. ఆమె ఒక కాషాయి రంగు వస్త్రం కట్టుకుని, అలాంటిదే మరొకటి కప్పుకొని ఉంది. కోడలికేసి చూస్తూ శాంతస్వరంతో, "పెళ్ళికింక పది రోజులే ఉన్నది వ్యవధానం, కదూ ?" అని అడిగింది.

జగద్ధాత్రి ముఖం పైకెత్తి, "పదిరోజు లెక్కడండీ ? ఇవాళతోకూడా కలుపుకుంటే తొమ్మిది రోజులేగా ! ఈ కార్యంకాస్తా నెరవేరితే బ్రతికిపోతాం ఈ పాడు ఊళ్ళో తలపెట్టిందేదో పూర్తి అయేంతవరకు నమ్మకం ఉండదు" అన్నది.

అత్తగారు కొంచెం నవ్వి, "అన్ని ఊళ్లల్లోనూ ఉన్న భయమే ఇది. కేవలం మీా ఒక్క ఊళ్ళోనే కాదు. ఇలాంటి లక్ష్మీవిగ్రహాన్ని నీళ్లల్లో వదిలేస్తున్నప్పుడింక ఇలా నమ్మకం లేదని అనుకోవటానికి ఏముంది ?" అన్నది.

జగద్ధాత్రి మెదలకుండా తనపని తాను చేసుకుంటూ, దీనికి సమాధానం ఇవ్వలేదు.

"మావాడిదగ్గర అన్ని సంగతులూ విన్నా. ఇవాళ ప్రొద్దున స్నానానికి వెళ్ళివస్తూ అరుణుడినికూడా చూశా. అలా బంగారపు ఛాయని చంద్రుడిలాంటి పిల్లవాడు నీకు నచ్చలేదా ?" అన్నది అత్తగారు.

జగద్ధాత్రికి ఈ ప్రశ్న అంతగా సంతోషాన్ని కలిగించలా. "కాని కేవలం నచ్చినంతమాత్రాన అన్నీ కావండీ !" అంది.

"కాదు, అది ఒప్పుకోను. కాని స్నానమయి వచ్చాక సంధ్యద్వారా అతడి విషయాలు ఆభాసగా విన్నంతలో కలిగిన దుఃఖంతో నా గుండెలు బ్రద్దలయాయి. ఆఁ, నువ్వు తల్లి వైఉండికూడా ఈవిషయాన్ని గ్రహించలేకపోయావా ?" అన్నది అత్తగారు.

ఇది ఆమె దృష్టిలోపడి చాలా కాలమయింది. కాని ఒప్పుకోనటం మాత్రం అసంభవం. పైగా భయంతో అటూ ఇటూ చూసి గొంతు అణచుకుని, "షనీ పాటా ఉండే ఇల్లు ఇది. ఎవరైనా వచ్చారంటే వినిపోతారు అత్తయ్యా?" అంది.

అత్తగారింక ఏమీా మాట్లాడలా. కాని జగద్ధాత్రి కంఠస్వరంలోని కఠినత్వానికి తానే సిగ్గుపడి, మెల్లిమెల్లిగా —

"సరే కానీండి, మీరు కూడా ఇలా అంటారేమిటి? మీ వంశమర్యాదనంతా గంగలో కలిపి, ఇంక లోకులకు ముఖం ఎలా చూపగలరో చెప్పండి! అదీగాక అతడికి జాతి కూడా లేదు. అతడి తరఫున ఈ మాటలన్నీ మీతో చెప్ప టానికి వకాల్తా పుచ్చుకున్న వారు—ఈ సంగతి చెప్పలేదా మీతో?" అన్నది.

ఇహ తర్వాత ఎవరు చెప్పేందుకు ఏమీ ఉండదని జగద్ధాత్రి అనుకుంది. కాని అత్తగారు తలఊగిస్తూ—"చెప్పక పోవటమేం? చెప్పారు. కాని అతడికి పోయిందేమీ లేదు కోడలా! ఉన్నదున్నట్లుంది. కేవలం అతడికి విద్యాబుద్ధులు న్నాయని చెప్పటంలా. అలగాజాతివాళ్ళని చెప్పి, దిక్కులేని ఆడవాళ్ళ నిద్దరిని మీరు వెళ్ళగొడితే, అతడు వాళ్ళను మనః పూర్వకంగా తన దగ్గరకు తీసుకోగలిగాడు. అతడి జాతికి భగవంతుని వరంవల్ల అమరత్వం సిద్ధించింది. ఆ జాతిని ఇంక మానవులు నాశనం చెయ్యలేరు" అంది.

జగద్ధాత్రి లోలోపల కోపం తెచ్చుకొని, "దిక్కులేని వాళ్ళని చెప్పి యానాదివాళ్ళనూ, ఎరికలవాళ్ళనూ బ్రాహ్మణ కొంపల్లోకి తెచ్చిపెట్టుకుంటారా, అత్తయ్యా? శాస్త్రాలు అలా చెప్తున్నాయా?" అంది.

"శాస్త్రాలు ఏమని చెబుతాయో నాకయితే సరిగ్గా తెలియదు, కాని నా వ్యథ ఎంతటిదో మాత్రం నాకు బాగా తెలుసు. నా వ్యథ ఎవరికీ చెప్పేది కాదు. ఇలాంటి వ్యథ నీకే గనక కలిగితే, నీచజాతివాళ్ళని, సాటి మానవులను అస హ్యించుకున్నందుకు తగిన శిక్ష భగవంతు డేవిధంగా విధి

స్తాడో-అదిమాత్రం నువ్వు తెలుసుకో గలిగేదానివి. ఈ కుల గౌరవమనేది ఎంత మహాపాపమో, ఎంతటి మోసమో, ఆ బరువును నువ్వు నిజంగా గ్రహించగలిగినట్లయితే నీ కూతుర్ని ఇలా బలిచేసుకోలేవు. కులమూ, జాతీ ఈ రెండూ సత్యమైనవీ - ఈ ఇద్దరు ప్రాణులూ జీవితమంతా అనుభవించవలసిన సుఖదుఃఖాలు రెండూ ఇంతటి మిథ్యలా తల్లీ?"

జగద్ధాత్రి క్షుబ్ధురాలై - "అలా అయితే ఈ మిథ్యను పురస్కరించుకునే ప్రపంచం నడుస్తున్న దంటారా, అత్తయ్యా?" అంది.

అత్తగారు కొంచెం మ్లానంగా నవ్వి "ప్రపంచం నడవటంలేదు. నడుస్తున్నదల్లా మన జాతిలాగా అభిశప్తమైన జాతులే. నేను పరదేశంలో ఉన్నాను. వయస్సు చాలా గడిచింది. ఎన్నో చూచాను. ఎంతో దుఃఖాన్ని అనుభవించాను. నువ్వు దేన్నిఅయితే కులగౌరవమని అంటున్నావో, భావిస్తున్నావో, దాని యాథార్థ్యమెంతటిదో నాకు తెలుసు. కాని ఆ విషయాలన్నీ నీకు విస్పష్టంగా చెప్పనూలేను; ఒకవేళ చెప్పినా బహుశా నువ్వు గ్రహించనూలేవు. అయినా ఈ ఒక్క విషయంమాత్రం మనస్సులో ఉంచుకో -మిథ్యను మర్యాదనిచ్చి, దానికెంత ఔన్నత్యాన్నయినా కలిగించు; దానిలోనే అంత దుఃఖం, అంత మాలిన్యం, అంత అనాచారమూ పేరుకుపోతాయి. అలాగే పేరుకుపోయాయి కూడా" అన్నది

జగద్ధాత్రి ఏదో సమాధానం చెప్పబోయింది. కాని ఇంతలో కూతురు రావటంచూసి, మెదలకుండా ఊరుకుంది.

సంధ్య ఇంతసేపటివరకూ, పెరట్లో తాను పెంచిన పూల మొక్కలకు నీళ్లు పోస్తోంది. ఇంట్లోకి వస్తూ చేతిలో ఉన్న చిన్నబిందె ప్రాంగణంలో ఉన్న అరుగుమీద పెట్టి ఎదురుగా వచ్చి నుంచుని, తల్లి కేసి చూస్తూ "అవేమిటి అమ్మా? కొబ్బరిలవుజు లనుకుంటాను" అని హఠాత్తుగా నాయనమ్మ కేసి చూసి, "ఆఁ, నాయనమ్మా, ఇక్కడంతా లడ్డూలు చేసుకుంటూ ఉంటారు. మన ఇంట్లో చేసుకోరు ఎందుకని?" అని అడిగింది

కాళీతార కొంచెం నవ్వి, వాత్సల్యంతో "ఆ సంగతి నాకు తెలియదే అమ్మాయీ!" అంది.

"ఆఁ. మీ అత్తగారిని ఈ సంగతి ఎప్పుడూ అడగ లేదనుకుంటాను."

"ఎలా అడుగుతాను చెప్పు తల్లీ! జన్మలో ఎన్నడూ అత్తగారి ఇంటిముఖం చూడనే చూడకపోతిని!"

జగద్ధాత్రికి ఈ సంగతి తెలుసు. ఆమె సిగ్గుపడి, మెదలకుండా తలవంచుకుని తన పని తాను చేసుకోసాగింది. "సరే కాని నాయనమ్మా, నీకు మొత్తం సవతు లెంతమంది! వందమందా? రెండు వందలా? మూడు వందలా? నాలుగు వందలా?" అని అడిగింది సంధ్య.

నాయనమ్మ మళ్ళీ నవ్వి – "సరీగ్గా తెలియదు కాని నువ్వు చెప్పింది అసంభవం మాత్రం కాదు. నాకు ఎనిమిదో యేట పెళ్ళి అయింది. అప్పటికే వారికి ఎనభై ఆరుగురు భార్యలు. ఆ తర్వాతకూడా చాలా పెళ్ళిళ్లు చేసుకున్నారు.

కాని ఎంతమందిని చేసుకున్నారో వారికే తెలియదు. అది ఇహ నాకెలా తెలుస్తుంది ?" అంది.

"దానికేమయినా లెఖ్ఖ! వ్రాసిన పుస్తకం ఉందా నాయనమ్మా ? అది కనుక లాక్కొని ఉంచినట్లయితే నాన్న గారి చేతికిచ్చి మొత్తం ఎంతమందో లెఖ్ఖ వేయించి వారంతా ఎక్కడెక్కడ ఉన్నారో, నాకెంతమంది పిన తండ్రులో, ఎంతమంది పెత్తండ్రులో, ఎంతమంది చెల్లెళ్ళు అక్కలూ ఉన్నారో తెలుసుకునేదాన్ని, అలా అయితే ఎంత బాగుండేది ?" అని సంధ్య కొంచెం నవ్వి "సరే నాయనమ్మా ! తాతయ్య ఒకవేళ ఎప్పుడైనా వచ్చినట్లయితే ఎన్ని రూపాయలు ఇవ్వవలసివచ్చేది ! ఇచ్చిపుచ్చుకోవటాలలో బహుశా నీతో బాగా జగడమవుతూ ఉండేదనుకుంటా కాదూ ?" అంది.

జగద్ధాత్రి బాగా కోపం తెచ్చుకొని, "ఈ పిచ్చి ప్రశ్నలన్నీ మానేసి, పూజాగృహానికి గోళ్ళెం పెట్టిరా సంధ్యా !" అంది.

నాయనమ్మకూడా కొంచెం నవ్వి, "అన్నీ తెలిసినవే అయినా కాని, ఇంకా నీకు వ్యామోహం పోలేదా ?" అంది.

ఈ విరుద్ధమైన ఆలోచనలన్నీ జగద్ధాత్రికి అంతగా నచ్చలేదు. మనస్సులో ఆమెకు విరక్తికూడా ఎక్కువవుతూ వచ్చింది. అత్తగారి మాటలకు సమాధానంగా - "ఆనాటి విషయాలయితే నాకు తెలియవుకాని, ఈ రోజుల్లో అన్ని పెళ్ళిళ్లు ఎవరూ చేసుకోవడంలేదు. ఆ అత్యాచారాలుకూడా

లేవు ఇప్పుడు. కొంతకుంది ఎప్పుడో ఏదో అన్యాయంచేశా రని చెప్పి. వంశమర్యాదని ఎవరైనా వదిలేసుకుంటారా? నేను బ్రతికివుంటే అలా ఎన్నడూ జరుగదు" అంది. గృహయజ మానురాలైన కోడలి ఉత్తప్త కంఠస్వరానికి అత్తగారు మెదలకుండా ఊరుకుంది. సంధ్య వ్యథితురాలై నాయనమ్మకు మరింత దగ్గరగా జరిగి, కోమలస్వరంతో "వాళ్లు ఇలాంటి అత్యాచారాలు ఎందుకు చేసేవారమ్మా? వారికి మాయా మమతలు వుండేవికావా?" అని ప్రశ్నించింది.

నాయనమ్మ సంధ్యచెయ్యి పట్టుకొని దగ్గరగాలాక్కొని ప్రక్కన కూర్చోపెట్టుకుని, "వారికి మమతఎందుకుంటుంది తల్లీ? ఒక్కరాత్రి తప్ప జీవితంలో ఇంకెన్నడూ చూడని వారి విషయంలో ఎక్కడైనా ప్రాణాలు విలవిలలాడుతాయా? ఆ అత్యాచారాలు ఈనాడయినా జరగకుండా మానాయా? నీమీద జరుగుతున్న అత్యాచారం మాత్రం వాటి అన్నిటి కన్నా తక్కువదా?" అంది.

జగద్ధాత్రి చేతిలో ఉన్నపని కట్టిపెట్టి చటుక్కున లేచి నుంచుని కూతుర్ని ఉద్దేశించి అతి కఠినస్వరంతో "నువ్వు వెడతావా; పూజాగృహంలోకి, లేదా? ఈ పనులు ఎక్కడివి వక్కడ వుంచి నన్ను వెళ్ళమంటావా సంధ్యా!" అంది.

సంధ్య తల్లిముఖంకేసి చూసిందికాని, సమాధానం మాత్రం చెప్పలా; అక్కడినుంచి లేచివెళ్ళటానికి ప్రయత్నిం టలా—"ఏ వస్తువుకైతే ఇంత మర్యాద, ఇంత గౌరవము ఇన్నాళ్ళనుంచీ వస్తున్నాయో, అలాంటిదాన్ని వదిలెయ్యడం మంచిదా నాయనమ్మా?" అని మళ్ళీ ప్రశ్నించింది మెల్లిగా.

అత్తగారు కోడలి కఠోరస్వరాన్ని ఈసారి చెవిని పట్టించుకోకుండా, మనమరాలి ప్రశ్నకు జవాబిచ్చింది. "ఏదో ఒకటి చాలా రోజులునుంచి అనుపూర్వికంగా వస్తున్నంత మాత్రాన మంచిది అవదు తల్లీ! గౌరవపూర్వకంగా వస్తూన్నా మంచిదికాదు. మధ్య మధ్య మంచిదా; చెడ్డదా అని దాన్ని పరిశీలించి చూచుకుంటూ ఉండాలి. మనంత్వం కొద్దీ అలా విచారించి చూచుకోకుండా కళ్లుమూసుకు కూర్చున్నవాళ్లు నశిస్తారు. నాగాథ యావత్తూ యెవరికీ చెప్పేదికాదు తల్లీ! కాని ఇదే విషజ్వాలలాగా చుట్టుముట్టి నా జీవితాన్ని ధ్వంసంచేసేద" అని అంటూండగా ఆమె కంఠం లోపల అవ్యక్తంగా ఉన్న బాధతో, మూసుకుపో సాగింది.

సంధ్య ఆమెచేతిని తన చేతిలోకి తీసుకొని మెల్ల "ఈ విషయాలింక ఆపు నాయనమ్మా?" అంది.

ఆమె మరొకచేత్తో మనుమరాలిని హృదయం దగ్గరకు చేర్చుకొని, నిశ్శబ్దంగా తనను తాను ఒక్కక్షణం సంబాళించుకొని, తర్వాత సహజ కంఠస్వరంతో మెల్లి మెల్లిగా— "ఈ దేశపు రాజులు ఒకప్పుడు కేవలం" గుణసముదాయాన్ని పురస్కరించుకునే బ్రాహ్మణులకు కులగౌరవమిచ్చి వారిని ఒకజాతిగా చేశారు. తర్వాత మళ్ళీ ఒకప్పుడు ఈ దేశపు రాజులే ఆ వంశధరుల దోషాల్ని మాత్రమే లెక్కించి వారిని ఒకజాతిగా ఏర్పాటుచేసిన దుర్దినంకూడా వచ్చింది. త్రుటి అనాచారాలమీద ఏ గౌరవం ప్రతిష్ఠితమయిందో, దాని లోపలవున్న మిధ్యను తెలుసుకున్నట్లయితే ఈనాడు ఏద

యితే మిమ్మల్ని ముగ్గుల్ని చేస్తోందో, కేవలం ఆ కులమే కాక, అలగాజాతి వాళ్ళని చెప్పి ఏ యానాది ఆడవాళ్ళను ఇద్దర్ని వెళ్ళగొట్టారో వాళ్ళకులం తక్కువది అని చెప్పటానికి కూడా మీ తలలు సిగ్గుతో నేలకు వాలిపోతాయి" అన్నది.

జగద్ధాత్రి కోపాన్ని, విరక్తిని సహించలేక అక్కడి నుంచి లేచి వెళ్ళిపోయింది. కాని సంధ్య మాత్రం మెదల కుండా అక్కడే కూర్చుంది. సత్యవాదిని సన్యాసిని అయిన వృద్ధపితామహి హృదయంలో - లజ్జా దుఃఖాలను కలిగించే ఇతిహాసమేదో ఉందనీ - దాన్ని పైకి వ్యక్తం చెయ్యలేక పోతున్నదనీ, అంచేత ఆమె హృదయం వగలిపోతోందని సంధ్యకు తోచసాగింది. తన తాతగారు చేసుకున్న అనేక వివాహాలతో ఈ బాధకేదో ఘనిష్ఠమైన సంబంధం ఉండి ఉంటుందని చటుక్కున స్ఫురించింది. కొంత సేపటివరకు సంధ్య మెదలకుండా కూర్చుని, సిగ్గుపడుతూ "మనలో ఇంత బాగా అనాచారం ప్రవేశించినమాట నిజమేనా నాయనమ్మా! దేన్ని చూసుకుని ఇంత గర్వపడుతున్నామో - అందులో అంతా కపటమేనా?" అని ప్రశ్నించింది. "అదెంతమోసమో నాకన్న ఎక్కువ ఎవరికీ తెలియదు" అని అనబోతుండగా ఆమె కళ్ళల్లో నీళ్ళు గిర్రునతిరిగాయి. ఆ కన్నీళ్ళు ఆ సంధ్యచీకటిలోకూడా, సంధ్యకు తెలియక పోలేదు. ఆమె చేత్తో కళ్లు తుడిచేసుకుని మెల్లిమెల్లిగా "కాని ఇప్పుడు మధ్యమధ్య నేనేమనుకుంటూ ఉంటానో తెలుసా సంధ్యా? మనుష్యులకూ మనుష్యులకూ మధ్య ఏర్పడ్డ ఈ హద్దులెన్నటికీ భగవంతుడేర్పరిచిన - నియమమై

ఉండదు. ఆయన్ని కలుసుకోవటానికి వెళ్ళేందుకు తెరచి ఉంచిన సింహద్వారంలో మానవులు ముళ్ళకంపమీద ముళ్ళ కంపలు ఎంత దడికట్టినా - ఈ ఆత్మ్యాచారపు దడి అంతకంత అనాచారంతో శతచ్ఛిద్రమవుతూనే ఉంది. వాటినుంచి పైకి కనుపించకుండా పాపపంకిలాలు లోపల ప్రవేశిస్తూ ఉంటాయి."

ఆ తర్వాత ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. ఈ విషయాలకీ తన తాత పెళ్ళిళ్ళకూ ఏదో హీనమయిన సంబంధ మున్నదని సంధ్యకు దృఢపడసాగింది. అది ఎలాంటిదో ఏ మాత్రమూ తెలియకపోయినా ఆమె కేదో భయం కలగ సాగింది,

"పద అమ్మా! పూజాగృహంలోకి వెళ్ళి ఆ పనేదో పూర్తిచేసెయ్యి. లేకపోతే మీ అమ్మ చాలా కోప్పడు తుంది" అన్నది నాయనమ్మ. సంధ్య పరధ్యానంతో "ఇప్పటికి అదేదో ఆమె చేసుకుని ఉంటుంది" అని ఆమె చెయ్యిచ్చుకుని "పద నాయనమ్మా! నా గదిలోకి వెళ్ళి కూర్చుని కాస్త ఆ కాలపు గాథలు చెప్పుకుందాం" అని ఒక విధంగా ఆమెను బలవంతంగా తన గదికేసి తీసుకు వెళ్ళింది.

౧౧

రాత్రి అట్టే పొద్దుపోలేదు. మహా అయితే జాము ప్రొద్దోయిందేమో. కాని చలికాలంలో పల్లెటూళ్ళల్లో ఆ మాత్రం ప్రొద్దోయినా రాత్రి ఎంతో గంభీరంగా

ఉన్నట్లుంటుంది. జ్ఞానదా పడకగదిలో ఒకమూల దీపం మినుకుమినుకు మంటోంది. జ్ఞానదా నేలమీద కూర్చుని ఉంది. ఆమె ప్రక్కనే రాసమణి కూర్చుని చేతులూ ముఖమూ తిప్పుతూ, "చెప్పిన మాటవిను జ్ఞానదా! పిచ్చి చేష్టలు చెయ్యకు. మందిచ్చి వెళ్ళాడు—గుటుక్కున త్రాగేసెయ్యి. మళ్ళీ ఎలా ఉన్నదానివి అలా మామూలు మనిషి వై పోతావు! ఎవళ్ళూ తెలుసుకోలేరు" అని చెప్పటం మొదలెట్టింది.

జ్ఞానదా కన్నీళ్ళు కారుస్తూ గద్గదస్వరంతో "ఇలాంటి మాటలు మీరు నాకెలా చెప్పగలుగుతున్నారు అక్కగారూ! ఒక పాపంచేసింది కాక దానిమీద మరో మహాపాపం ఎలా చెయ్యను చెప్పండి? నాకు నరకంలోకూడా స్థానముండదు" అంది.

రాసమణి భయపడుతూ – "ఇంతటి గొప్ప వంశానికి కళంకం తీసుకొచ్చి, నువ్వింకా స్వర్గానికి వెడదామనుకుంటున్నావా! బాగా ఆలోచించి మంచిగా నేచెప్పినట్లు చెయ్యి. పెంకితనంచేసి, దేశానికంతటికీ పూజ్యుడైన అన్నని తల వంచుకునేట్లు చెయ్యకు" అంది.

జ్ఞానదా చేతులురెండూ జోడించి ఏడుస్తూ "ఆ మందు నేను రవంతయినా పుచ్చుకోను. నాకు విషమిచ్చి మీరు చంపెయ్యదలచుకున్నారు. నాకు బాగా తెలుసు" అంది.

రాసమణి ముఖం అతివికారంగా పెట్టి – "అయితే అలా చెప్పు. చస్తాననే భయంతో పుచ్చుకోవటం లేదన్నమాట. ధర్మాలు చెప్పబోతావేం?" అంది.

"కాని అది విషం కదా!" అంది జ్ఞానదా.

"విషమయితే నీకేం? నువ్వేం చావవులే" అంటూ తీక్షణమైన కంఠస్వరాన్ని ఒక్క రెప్పపాటులో అతికోమలం గానూ, కరుణ పుట్టిస్తున్నట్లూ మార్చి - "పిచ్చిదని ఇంకెవర్ని అంటారు నిన్ను కాకపోతే...! మేము నీకు చెడు మందులు త్రాగమని చెపుతామా చెప్పు చెల్లీ! ఇలా ఎక్కడన్నా ఉంటుందా? రాసమణి ఎన్నడైనా ఇలాంటిమాటలు చెపుతుందని ఎవరయినా అనగలరా? అది కాదు చెల్లీ! దుర దృష్టంకొద్దీ నీ కడుపునపడ్డ శత్రువును తొలగిపోనీ. అదెంత సేపు పని! ఆ తర్వాత ఇహ మునపటిలాగానే తిను, తిరుగు, తీర్థాలు, స్నానాలూ, ధర్మాలూ, వ్రతాలూ, పుణ్యాలు—ఎన్నైనా చెయ్యి. ఇంక ఈ సంగతి ఎవరు వింటారు? ఎవరు తెలుసుకుంటారు?" అన్నది రాసమణి.

జ్ఞానదా తలవంచుకుని మాట్లాడకుండా కూర్చుంది.

"అయితే ఇహ తీసుకురమ్మని చెప్పనా?" అన్నది రాసమణి.

జ్ఞానదా ముఖం ఎత్తలేదు. కాని ఏడుస్తూ, "ఊహూఁ, ఆ మందులేవీ ఏమాత్రం త్రాగను. అవి త్రాగానంటే నే నెన్నటికీ బ్రతకను" అంది.

రాసమణి విపరీతంగా కోపం తెచ్చుకుని, "నీది ప్రపంచంలో ఎక్కడా లేని మొండితనం. మహాఅన్యాయం జ్ఞానదా! త్రాగకపోతే లేచిపో ఇక్కడనుంచి. మగవాడతడు - ఏదో అలాంటిపని చేశాడని చెప్పి, ఆడవాళ్ళుకూడా ఇలా మొండి

కేసుకు కూర్చుంటే సాగదు! ఛటర్జీ తమ్ముడికు చెప్పనే చెప్పాడు. సరే జరిగిందేమో, జరిగిపోయింది. ఆమెకు ఓ యాభై రూపాయలిస్తాను. కాశీకాని, బృందావనంకాని వెళ్ళ మను” అన్నాడు. ఇంక ఆయన్ని తప్పుపట్టేందుకు ఏముంది జ్ఞానదా? రూపాయలేం తక్కువకాదు. ఒక్కసారిగా ఓ గుప్పెడు...” అన్నది.

“నేను రూపాయలు కావాలనటంలేదు అక్కగారూ! డబ్బు తీసుకుని నేనేం చేస్తాను? నే నెక్కడా ఎవర్నీ ఎరగను. నే నెక్కడికన్నా తేమాత్రం ఎలా వెళ్ళి తలఎత్తుకుని నిలబడ గలను?”

“నువ్వు మమ్మల్ని లొంగతీసుకోవాలని వేసే ఎత్తు కాదా జ్ఞానదా? కాశీ- అని, బృందావనం అని ఎంతోమంది చెప్పుకుంటూ ఉంటారు. అంతమందికి అక్కడ స్థానం ఉండగా, నీకేనా లేకపోయేది?”

జ్ఞానదా ఒక్కక్షణం మెదలకుండా ఊరుకొంది. “నాకన్నీ తెలుసు రాసుదీదీ! రేపుఆయన ప్రాణకృష్ణ ముఖర్జీ గారి అమ్మాయిని పెళ్ళిచేసుకోబోతున్నారనీ తెలుసు. అంచేత ఇవాళ నాకు విషమివ్వనీ, కాశీ సంపెయ్యనీ, నన్ను ఇంట్లో ఉండకుండా దూరంచెయ్యాలని అనుకుంటున్నారు. కాస భగవంతుడా!—” అని చెబుతూ చెబుతూనే ఆమె చటుక్కున భావురుమని ఏడ్చి, చేతులు రెండూ ఎత్తి జోడించి. “భగవంతుడా! నీ పాదాలదగ్గర ఇంతమందికి స్థాన మున్నప్పుడు –నాకూ ఉంటుంది. కాని చిన్నప్పటినుంచీ నే నెన్నడూ ఏ పాపమూ చేసిఎరుగను. చెయ్యవలసిన అవస

రమూ రాలేదు—కాని నీకు అన్నీ తెలుసుకదా! ఈ పాపానికి తోడు శిష్టాభారాన్నికూడా కేవలం నిరుపాయరాల్నికనుక నా నెత్తిచేవేసి రుద్దుతావా!" అంది.

భగవంతుని పేరెత్తేసరికి రాసమణికి అంతులేనికోపం వచ్చిందన్లే వుంది. ఆమె గద్దిస్తూ "అయితే చావు, తిట్లూ, శాపనార్ధాలూ ఎందుకు! నువ్వేం పసిపిల్లనా? నువ్వు చనువు ఇవ్వకపోతే మగవాడేంచేస్తాడు? అతడి తప్పేముంది, ఇలాటి వ్యక్తి ఎక్కడైనా వున్నాడేమో, ఎవర్నైనాసరే రాస మణికి చెప్పమను-చూస్తాను!" అంది.

ఇంక దీనికి సమాధానమేమిటి? జ్ఞానదా మెదలకుండా పమిటచెంగుతో కళ్ళుతుడుచుకోసాగింది. రాసమణి కొంచెం గొంతు తగ్గించి నిమ్మళంగా—"ఆ కోయదాని మందుపుచ్చు కోటమంటే నీకు భయంవేయచ్చు. ప్రియముఖర్జీమీద నమ్మ కమేగా! అతడే ఏదయినా కాస్త ఇలాంటి మందుఇస్తే—"

జ్ఞానదా తెల్లపోయి "ఆయన ఇస్తారా?" అంది.

"హుం. ఇవ్వడూ? ఛటర్జీ ఇవ్వమంటే ఇవ్వకుండా తప్పించుకోలేడు. కబురుపంపించాడు, వస్తూ ఉంటాడు! అప్పు డిహ కాదంటే వీల్లేదు. ముందే చెబుతున్నాను సుమా!"

జ్ఞానదా మెదలకుండా చూస్తూ ఊరుకుంది. రాసమణి ఇంకా ఉత్సాహం కలిగేమాటలు ఏవో చెప్పపోతుండగా— దగ్గరలోనే ప్రాంగణంలో చెప్పులచప్పుడు - ముఖర్జీగొంతూ వినిపించాయి—

"ఆఁ. ఇక్కడ ఒకదీపమయినా పెట్టలేదేంచేక! ఇక్కడివాళ్ళంతా ఎక్కడికెళ్ళారు?" అంటూ ప్రియముఖర్జీ

టకటక చప్పుడు చేసుకుంటూ ఇంట్లోకివచ్చాడు. చంకలో పెట్టుకున్న పుస్తకాలు చిన్నవీ పెద్దవీ నాలుగయిదు—తీసి బల్లమీదపెట్టి, చేతిలోని మందులపెట్టె క్రిందపెడుతూ పెడుతూ-"ఇవాళ యెలావుంది జ్ఞానదా? హుఁ. హుఁ. అని మూలిగితే కాదు - అలాఅయితే సాగదు. చలిగాలి వేస్తున్నప్పుడు క్రింద కూర్చోకూడదు. రెమెడీ కొంచెం మార్చాలేమో అని చూస్తున్నా. వారెవరూ? ఓహో పిన్నా! యెంతసేపయిందీ వచ్చి? అంతా బాగున్నారా? నీ మనుమరాల్ని దారే వస్తూ వస్తూ చూశానమ్మా! అంత కులాసాగా ఉన్నట్లు కనిపించలా. ఆకలి ఎలాఉంటుంది? రేపు ఒకసారి తీసుకొచ్చి దానినాలిక ఎలా ఉందో చూపించు. చావటానికికూడా తీరకలేకుండాఉంది నాకు. ఏ వైపుకని వెళ్ళను ఏవైపుకేసిఅయితే నాదృష్టిపడదో అక్కడ ఇలాగే— రేపు అమ్మాయిపెళ్ళి, రేపువుదయమే - ఎక్కడచూసినా - ఇంటికి చేరుకోవాలి, ఆమ్మాయిపెళ్ళిగా-రేపు ఇంకబైటికి ఎక్కడకురాలేను. కాని ఈ రోగులంతా ఏమవుతారా అని అదే ఆలోచిస్తున్నా, ఒకళ్ళా ఇద్దరూ కాదు. ప్రియముఖర్జీనితప్ప ఎవళ్ళా విపిన్ను పిలవడలచుకోటంలా ఇలాఉంది అతడికి మాత్రం ఎలా గడుస్తుంది? పాపం జాలేస్తుంది. ఏమయినా అతడూ కాస్త నేర్చుకున్నాడు! ఏదీ చెయ్యి ఇలా ఇయ్యి కాస్త చూస్తాను. 'పంచూ'కు గుండెజబ్బట! చప్పున వెళ్ళి అతణ్ణికూడా ఒకసారి చూసిరావాలి. చెయ్యి ఏదీ ఒకసారి ఇలా ఇయ్యి—"

జ్ఞానదా చెయ్యిచాచకుండా మెదలకుండా తలవంచుకు కూర్చుంది.

"దీనికి జబ్బుఏమిటో సరిగ్గా తెలుసుకున్నావా నాయనా?" అని అడిగింది రాసమణి.

ముఖర్జీ ఆమెముఖంకేసి చూసి- "డిస్- అజీర్ణం- పైత్యం-" అన్నాడు. కాని ప్రశ్నవేసిన రాసమణి మెల్లిమెల్లిగా శిరశ్చాలనం చేయటం చూసేసరికి అతడికి తన వైద్యవిద్య అంతా ఒక్కసారి అంతరించిపోసాగింది. "ఎందుకని? ఎందుకని? ఎందుకు కాదేమిటి? విపినుడు వచ్చాడా ఏం? ఏంమందిచ్చివెళ్ళాడో ఏదీ చూస్తాను?" అన్నాడు వ్యగ్రుడై.

రాసమణి ముఖంలో సత్యాసత్యాలూ, ఉగ్రత్వకోమలత్వాలూ, మంచిచెడులూ పరస్పర విరోధంలేకుండా వ్యక్తమవుతూఉంటాయి. భూమిని దగ్గరున్నంచీ ప్రారంభించి చెప్పేనేర్పు ఆమెకు దైవవశాత్తూ లభ్యమైంది. అయినా ఆమెకూడా ఇవాళ కొంచెం ముందువెనుకలు చూడాల్సి వచ్చింది. తలతిప్పుతూ, "లేదునాయనా! విపినుడికి కబురు, చెయ్యలేదు. పరాన్ ఛటర్జీని పిలువలేదు! నీముందరవాళ్లెంత! వాళ్ళకివైద్యం ఏంతెలుసు? ఈమాటే ఛటర్జీ అందరిముందరా అంటూ ఉంటాడు" అంది.

"అనరా ఏం? ఈమాట అందరూఅంటారు. విపినుడికి నేను పదేళ్ళింకా నేర్పగలను. అప్పుడు 'పల్ సెటిలా' ఇచ్చి-"

"అదీగాక ఈ 'పుంధాకోరు' ఇలాంటిపనిచేసి కూర్చుంది నాయనా! నిన్ను తప్ప మరొకర్ని పిలవటానికి వీలులేదు."

ప్రియముఖర్జీ సగర్వంగా— "నేనుండగా ఇంకోడు వైద్యం చెయ్యటానికి ఇంట్లోకి రాగలడా? అయినా పిన్నీ! ఈ రోగాలు నయమవటానికి కొంత టైం తీసుకుంటాయి. తెలుసా? కాని అదీ చెబుతున్నాగా! నేను రెండుమూడు కన్న యెక్కువ రెమెడీలు వాడను. యెలా ఉంది జ్ఞానదా— రెండుమందులతో నాలికమీద నీరూరటం తగ్గిందా; లేదా? నిజం చెప్పు?" అన్నాడు.

వంచిన తల నేలకు వాలిపోయినట్లయింది జ్ఞానదాకు. ఆమెకు బదులు రాసమణే మాట్లాడింది. "అది నిన్ను తప్ప ఇంకెవర్నీ విశ్వసించదు నాయనా! నీ మందే దానికి ధన్వంతరిలాంటిది! కాని జబ్బు ఆదికాదు, ప్రియబాబూ! దురదృష్టవశాత్తూ ఈ దౌర్భాగ్యురాలికి దాపురించిన జబ్బు— నువ్వు అనుకున్నదానికి కేవలం విరుద్ధం."

ప్రియముఖర్జీ చెయ్యి ఎత్తి "విరుద్ధంకాదు. విరుద్ధం కాదు. నీపినుడి పాడుచెయ్యి పడినట్లయితే అలాగే జరిగేది. నిజమేకాని, ఏమాత్రం భయపడనక్కర్లా. ఈ వచ్చింది ప్రియముఖర్జీ." అన్నాడు.

రాసమణి నుదురుకొట్టుకుని, "నువ్వు బ్రతికించావంటే భయంలేదు నిజమే. కాని ఈ నష్టజాతకురాలు సర్వనాశనం చేసుకు కూర్చుంది! ఇప్పుడు దానికి తగినమందువేసి ఒడ్డెక్కించకపోతే ఈ కులానికంతకీ కళంకం వచ్చేదశ పట్టింది నాయనా?" అంది.

కాని ఇంతపెద్ద డాక్టరికికూడా తను చెప్పినమాటల్లో చివరిమా అర్థంకాలేదన్న సంగతి— అతడిముఖం చూడ

గానే రాసమణి ఒక్క నిమిషంలో గ్రహించేసింది. ఇది అతడికి సుస్పష్టంగా తెలియచెయ్యటానికి ప్రియబాబుని ఆమె ఇంట్లో ఒక మూలకు తీసుకువెళ్ళి అతడిచెవిలో చెప్ప గానే అతడులిక్కిపడి "ఏమంటున్నావు పిన్నీ? జ్ఞానదా?—"

"ఇంకేం చెప్పను నాయనా? మొహాన రాసినగీత ఎవడు చెరిపివెయ్యగలడు చెప్పు? గోలోక్ ఛటర్జీ యెత్తుకుని తిరుగుతున్న తల క్రిందికి వాలకుండా ఇప్పుడే ఏదయినా మందు ఇయ్యి నాయనా! అతడు ఒకదేశానికల్లా, తల. సంఘానికల్లా శిరోమణి! మగవాడు- అతడికిక ప్పు ఏముంది నాయనా? కాని అతడి ఇంట్లోచేరి ఈ దౌర్భాగ్యురాలు ఇలాంటి దిక్కుమాలిన పనులు చెయ్యవచ్చునా, చెప్పు!"

ప్రియబాబు తెల్లపోయాడు. ఒక్కసారి జ్ఞానదా ముఖం చూడాలని ప్రయత్నించి, తర్వాత మెల్లిగా 'మీరు విపిన్ డాక్టరుకే కబురుపంపటం మంచిది పిన్నీ! అలాంటి మందు లన్నీ నాదగ్గర లేవు''అని అతడువంగి, తన మందులపెట్టె, పుస్తకాలూ తీసుకుపోబోయినాడు.

రాసమణి ఆశ్చర్యపడి, "ఏమన్నావ్ ప్రియనాథ్! ఇది ఇంకా నలుగురిచెవినీ పడవచ్చా? ఏమయినా నువ్వు మన వాడివి. విపినుడు పరాయివాడు, శూద్రుడు—బ్రాహ్మల మానమర్యాదలు అతడికి తెలియచెయ్యవచ్చా?" అంది.

కాని ఇలా అనేలోపునే చటుక్కునతలుపు తెరచుకుని మెల్లిగా గోలోక్ లోపలికివచ్చి, ప్రియబాబు చెయ్యి పట్టు కు, బ్రతిమాలుతూ, "విషమనేభయంతో ఆమె ఇంక ఎవరి మందూ త్రాగటంలేదు బాబూ! లేకపోతే నీకీకష్టం కలిగించే

వాణ్ణికాదు. ఈ ఆపదనుంచీ నువ్వే గట్టెక్కించాలి ప్రియ నాథ్!" అన్నాడు.

ప్రియబాబు చెయ్యి వదిలించుకుని, "కాదు. కాదు. ఇలాంటి పాడుపనులన్నీ నేను చేసేవికావు. నేను రోగులను చూసి, రెమిడీ సెలెక్టుచేస్తా, అంతే! మీరు విపిన్నుణ్ణి — గిపిన్నుణ్ణి పిలిపించి సలహా అడిగి తీసుకోండి. ఇవన్నీ నాకేం తెలియవు." అని అతడు మరోసారి పుస్తకాలు చంకను పెట్టు కోబోయాడు.

గోలోక్ ఆచేతిని అలాగే మరోసారి తనచేతుల్లోకి లాక్కుని ఇంచుమించు ఏడుపుగొంతుకతో, "ప్రియనాథ్! ఈ ముసలివాడిమాట నిలబెట్టుబాబూ! బంధుత్వాన్ని బట్టి చూస్తే నీకు నేను మామగారి వరుస అవుతా — నువ్వు నామాట నిలబెట్టవని తెలిస్తే నిన్ను నేను పిలిపించేవాణ్ణి కాదు. బ్రతిమాలుతున్నాగా, బాబూ! ఏదో ఒక ఉపాయం చూపించివెళ్ళు - నీచేతులు పట్టుకున్నా." అన్నాడు.

ప్రియనాథ్ చెయ్యి మళ్ళీ విడిపించుకొని, "బంధు త్వాన్నిబట్టి మామగారు అవుతారని—మీరు చెప్పినంత మాత్రాన నేను జీవహత్య చేస్తానా? మొత్తానికి బలేవారు మీరు! పరలోకంలో ఏమని జవాబు చెప్పుకోను!" అన్నాడు.

గోలోక్ వెనక్కితిరిగి గుమ్మందాకా వెళ్ళాడు. అతడి ముఖభంగిమా, కళ్ళల్లోని భావమూ, కంఠస్వరమూ అన్నీ ఇంద్రజాలం చేసినట్లు ఒక్కనిమిషంలో మారి పోయాయి. అతడు కర్కశ కంఠంతో - "ఇంతరాత్రివేళ

పెద్దమనుష్యుల ఇంట్లోకి నువ్వెందుకు వచ్చావ్? ఇక్కడ నీ కేంపని ఉంది?" అని గద్దించాడు.

ఈ ప్రశ్నవిని ప్రియబాబు ఆశ్చర్యపోవటమేకాదు; హతబుద్ధి అయినాడు. "ఏం పనా? భలే, బాగుంది. చికిత్స చేయించుకోటానికి కబురుపంపింది ఎవరూ? ఓహ్!"అన్నాడు. గోలోక్ ఛటర్జీ బిగ్గరగా కేకపెడుతూ, "వాహ్-? వైద్య మంటే ఏమిటో నువ్వుకూడా ఎరుగుదువేం? దొంగ వెధవా! ఎవరు పిలిచారురా నిన్ను? ఎటునుంచి దూరావు ఇంట్లోకి? దొడ్డితలుపు ఎవరు తెరిచారు నీకు?" అన్నాడు.

జ్ఞానదా కేసి తిరిగి, "దౌర్భాగ్యురాలా! ఇందుక నేనా ముసలి మామగారు వచ్చి, ఏడుస్తూ తిరిగిపోయినా వెళ్ళక పోయావ్? ముసలి అత్తగారు చావుకుసిద్ధంగా ఉంటే - నేను స్వయంగా 'వెళ్ళు జ్ఞానదా! ఇలాంటి సమయంలో వాళ్ళకి ఉపచారం చెయ్యటానికి వెళ్ళకపోతే ఎలా?' అని ఎన్నివిధాల చెప్పాను? అప్పుడు కదలకపోయింది ఇందుక నేనా? రాత్రి రెండుఝాములప్పుడు చికిత్స చేయించుకోటానికేనా? ఆగు, ఆగు పాపిష్ఠిదానా! రేపు నీతల గొరిగించి ఊళ్ళోనుంచి వెళ్ళ గొట్టించకపోతే నేను గోలోక ఛటర్జీని కాదు" అన్నాడు.

జ్ఞానదా తలమీద అవగుంఠనంలేదు. ఎప్పుడు క్రిందకు జారిపోయిందో తెలియదు. ఆమెకు నోటమాటలేదు. కళ్ళు రెండూ ఇంత చేసుకుని కేవలం రాతిబొమ్మలా కూర్చుని ఉంది.

ఛటర్జీ రాసమణికేసి తిరిగి, "రాసూ! కళ్ళారా చూస్తున్నావుగా, వీళ్ళవ్యవహారం? నేను పదివూళ్ళకు సభా

పతిని. నాఇంట్లోనే ఇంత మహాపాపమా? పెద్దపులి గుహలో తోడేలున్నట్లయింది" అన్నాడు.

రాసమణికూడా ఇప్పటిదాకా తెల్లబోయి కూర్చుని ఉంది. "అంతేఅయింది తమ్ముడూ" అంది.

"దీనికి నువ్వే సాక్ష్యమున్నావు"

"ఉండకే! రాత్రివేళ చేతిలో పనిలేకుండా తీరికగా ఉండేసరికి జ్ఞానదా ఎలావుందో చూచి పోదామని వచ్చా. చూస్తునుకదా, ఇద్దరూ దగ్గిదగ్గిర కూర్చుని, నవ్వులు - వేళాకోళాలూ, వెకచెకాలు, గుసగుసలూ — ఒకటే కబుర్లు..." అంది.

జ్ఞానదా దీనికూడా సమాధానమేమీ చెప్పలా. ఆమె అలాగే కళ్ళు అప్పగించి రాతి బొమ్మలా కూర్చుని ఉంది.

ప్రియబాబు దయ్యంపట్టిన వాడిలా నుంచుని ఉన్నాడు. గోలోక్ ఛటర్జీ అతణ్ణి ఒక నెట్టునెట్టి, అతడి చేతిలోఉన్న పుస్తకాలు లాగిపారేసి, అతడిమెడ గట్టిగాపట్టుకుని ఒక్కతోపుతోసి. "పోరా వెధవా! నాఇంట్లోంచీ. నువ్వు రామతను బెనర్జీ అల్లుడివి-కాకపోయినట్లయితే నిన్ను జూటుతీసుకు తన్ని పోలేసు స్టేషనుకు పంపేవాణ్ణి" అని మళ్ళీ ఇంకోతాపు తన్నాడు. ఇంతలో నౌకర్లు, దాసీలు ఈ గందరగోళమంతా విని వసారాలోకివచ్చి నుంచున్నారు. వాళ్ళమధ్య నుంచే ప్రియబాబును మాటిమాటికీ తోసుకుంటూ బైటికివెళ్ళాడు ఛటర్జీ.

"వాహ్! భలే-బాగానేఉంది" అనుకుంటూ వెళ్ళిపోయాడు ప్రియబాబు.

నౌకర్లూ, దాసీలూకూడా ఆవెనకాలే వెళ్ళారు. రాసమణికూడా మెదలకుండా మెల్లిమెల్లిగా వాళ్ళవెనకాలే తనదారిని తానూ వెళ్ళింది.

అక్కడ ఉండిపోయిందిహ జ్ఞానదా ఒక్కతే. అలాగే నిశ్చలంగా, నిశ్శబ్దంగా-అచేతన ప్రతిమలాగా - కూర్చుండి పోయింది.

౧౨

ఇవాళ రోజల్లా ఊరంతా సన్నాయిమేళాలతో ప్రతిధ్వనిస్తోంది. ఈ మార్గశిరమాసంలో ఇవాళతప్పితే, ఇంక ముహూర్తాలు చాలారోజులదాకా లేవు. అంచేతనే కాబోలు ఈ చిన్న ఊళ్ళోకూడా ఇవాళ నాలుగయిదిళ్ళల్లో పెళ్ళిళ్ళు జరుగుతున్నాయి. సంధ్య పెళ్ళికూడా ఇవాళే.

జన్మభూమి వదిలి వెళ్ళిపోవాలనుకున్న అరుణ్ సంకల్పం అనేక కారణాలవల్ల కార్యరూపం ధరించలేదు. ఇదివరకులాగానే మళ్ళీ తనపనులు చూసుకోవటం మొదలెట్టాడు. పైకి మాత్రం అతడి జీవితంలో అట్టే పరివర్తన కలిగినట్లు కన్పించదు. కాని కొంచెంశ్రద్ధగా కనిపెట్టిచూస్తే- అతడికి దేశం మీద మమత్వం అంతర్హితమై పోయినట్లు తోస్తుంది. దేశానికి ఉపయుక్తమైన పనుల్లో తనకున్న ఘనిష్ఠ సంబంధాన్ని వదులుకుని దూరంగా నుంచున్నాడు. ఊళ్ళో అతడు వెలి. ఇన్నిఇళ్ళల్లో ఇన్ని పెళ్ళిళ్ళు జరుగుతున్నా అతడికెక్కడనుంచీ పిలుపురాలేదు. సంఘవ్యవస్థను నిలబెట్టటానికి

గాను అతడు ఎక్కడికీ వెళ్ళలేదివాళ- అతడికివాళ అన్ని ఇళ్ళ వాకిళ్ళూ బంద్.

సాయంకాల మయినప్పటినుంచీ అరుణ్ మేడమీాది తన రీడింగ్‌రూములో మెదలకుండా కూర్చుని ఉన్నాడు. చలిగాలి వీస్తోంది. అయినా తలుపులూ, కిటికీలూ మూసి లేవు. అన్నీ తెరిచేఉన్నాయి. గాలికి ఆతలుపులు కదలి చప్పుడవుతున్నాయి. నిర్మేఘంగా నిర్మలంగా ఉన్న ఆకాశంలో త్రయోదశీ చంద్రుని కిరణాలు ఈవైపునుంచి ఆ వైపువరకు వ్యాపించాయి. కిటికీలోంచి కొన్ని కిరణాల కాంతులు అతడి కాళ్ళ ముందరకూడా పడుతున్నాయి. అతడి ఎదుటనున్న వసారాకి దగ్గిరలోనే ఉన్న కొబ్బరిచెట్టు ఆకుల మీాద కొన్ని కిరణాలుపడి తళ తళ లాడుతున్నాయి. అర్ధ జాగృతిలోనూ అర్ధనిద్రలోనూ, ఉన్నట్లుగా ఉన్న అరుణ్ వాటినిచూసి ఏమాలోచించుకుంటూన్నాడో! ఎవ్వరూ ఎరుగరు. వంటవాడువచ్చి భోజనంసంగతి జ్ఞాపకంచేస్తే,నాకు ఆకలి లేదని చెప్పి అతణ్ణి పంపించేశాడు. చీకట్లో గోడనున్న గడియారం పదకొండుకొట్టి అతడికి నిద్రాసమయ మయిందన్నట్లు హెచ్చరించినా, అతడి కివాళ కదలబుద్ధి పుట్టటంలా. ఎలా ఉన్నవా డలాగే నిశ్శబ్దంగా కదలకుండా కూర్చున్నాడు.

హఠాత్తుగా ఎదుటిగుమ్మం తలుపుకొట్టిన చప్పుడూ, మరుక్షణంలోనే దాన్ని తెరిచిన చప్పుడూ, అతడి చెవిని పడ్డాయి. పిలిచి ఎవరో కనుక్కుందా మనుకున్నాడు - ఒకసారి. ఏమంటే పల్లెటూళ్ళల్లో రాత్రి అంత ప్రొద్దుపోయిన

తర్వాత ఎవళ్ళూ యెవళ్ళిళ్ళకీ వెళ్ళరు. కాని వాంఛ లేక పోవటంవల్ల అతనేమీ ప్రశ్నించలా.

కాని అట్టేసేపు ఆలోచించాల్సిన సమయం లేకపోయింది, కొన్ని నిమిషాల్లోనే గుమ్మందగ్గిర కొత్తపట్టుచీర కసకసమని చప్పుడవటమూ, దాంతోపాటు – యెవరో ఒక వ్యక్తి తుఫానులా దూసుకువచ్చి అతడి కాళ్ళదగ్గిర కూలబడి పోవటమూ జరిగింది.

అరుణ్ గాభరాగాలేచి నిలబడి చూచేసరికి–వెన్నెల్లో ఆ వ్యక్తి ధరించిన రంగుపట్టుచీరె తళతళలాడుతోంది. ఆ వ్యక్తి యెవరో కనురెప్పపాటులో గుర్తించేసరికి– అంతట్లోనే అతని హృదయం భయంతో, ఆశ్చర్యంతో నిండిపోయింది. ఏంచెయ్యాలో, ఏంమాట్లాడాలో ఏమీతోచలేదతనికి.

కాని దానికికూడా వ్యవధానం లేకపోయ్యింది. అణచుకున్న మర్మాంతికమైన భయానకాక్రందనం– హఠాత్తుగా ఇంటినీ, ఇంట్లో ఉన్న మసకచీకటినీ, గాలినీ – ఉన్నవాటి నన్నింటినీ ఛేదించి దడదడ లాడించింది.

రెండుమూడు నిముషాలు అరుణ్ మతిపోయినవాడి లాగా నిలబడి, తర్వాత కొంచెం పక్కకుజరిగి, "ఏంజరిగింది సంధ్యా?" అని అడిగాడు.

సంధ్యముఖమెత్తిచూసింది. ఆమె చీరెరంగుతోపాటు శరీరంమీద ఉన్న నగలన్నీ వెన్నెల్లో మెరసిపోతున్నాయి. సుందరమైన లలాంటిమీద చంద్రకాంతులు పడటంవల్ల చందన పత్రలేఖ ప్రకాశవంత మయింది. అశ్రుభారంతో

బిరువెక్కిన ఆమె విశాలనేత్రాలు రెండూ జ్వలించి పోతు న్నాయి. ఇలాంటి స్త్రీ స్వరూపాన్ని అరుణ్ యెన్నడూ చూడలా. అతడిప్పుడు చూసి ఒక్కసారిగా ముగ్ధుడయ్యాడు.

"అరుణ్ దా! నేను పెళ్ళిపీటలమీగనుంచి పారిపోయి వచ్చాను- నిన్ను తీసుకొ వెళ్ళటానికి. నాకిప్పుడు సిగ్గులేదు, భయంలేదు, మానావమానాలనే జ్ఞానంలేదు. నువ్వుతప్ప పృధివిలో ఇంక నాకెవరూ లేరీనాడు, రా నువ్వు." అన్నది సంధ్య

"యెక్కడికి రమ్మంటావ్?"

"యెక్కడనుంచి ఇప్పుడు ఒక వ్యక్తి లేచిపోయాడో, ఆ పెళ్ళిపీటలమీదికి."

అరుణ్ లోలోపల ఆహుతుడైనాడు, జరిగిన సంఘట నేదో అతడికి తెలిలిసిపోయింది. ఏదో పోట్లాటవచ్చి పెళ్ళి వారు పెళ్ళికొడుకును తీసుకుపోయిఉంటారు. హిందూ సమా జంలో ఇలాంటి సంఘటనలు తక్కువేమీకావు - అంచేత ఇతరులు పరిత్యజించిన ఈ ఆసనంమీదకి హఠాత్తుగా తనకి ఆహ్వానం వచ్చింది. ఏమైనాసరే; ఇవాళ తనపెళ్ళి జరిగి తీరాలి-అని సంధ్యకోరిక అయిఉంటుందని అనుకున్నాడతడు.

కాని తనమనస్సుకిలా ఆఘాతం తగిలినా అరుణ్ ప్రతి ఘాతం కలిగించలేకపోయాడు. పైగా స్నేహపూర్వకంగా "ఛీ ! నీఅంతటనువ్వు ఇలారావటం ఉచితంకాదు సంధ్యా ! సాధారణంగా ఇలాంటివి జరుగుతూనే ఉంటాయి. మీ నాన్న కాని, మరెవన్నాకాని, రాక పోయారా ఇక్కడికి?" అన్నాడు.

"మానాన్నా? ఆయన భయంతో ఎక్కడో దాక్కున్నాడు. మాఅమ్మ వెళ్ళి, చెర్లో దూకింది. ఆమెనెలాఅయితేనేం పట్టుకుని ఒడ్డెక్కించారు. సరిగ్గా నేనాసమయంలో నీదగ్గరికి పరుగెత్తుకొచ్చాను. ఉష్—ఇంతటి సర్వనాశనం పృథివిలో మరెవరికైనా జరిగిఉంటుందా ? మేమెలా బ్రతకటం?"

ఆమెచివరిమాటతో మళ్ళీ అరుణ్ మనస్సు కాఘాతం తగిలింది .- "కాని నిన్ను నాకిచ్చిచేస్తే మీకులానికి రక్షణ కలుగదు సంధ్యా! నేను చాల తక్కువకులపు బ్రాహ్మణ్ణి. అదీగాక దేశంలో యింకా బోలెడంతమంది కులీన బ్రాహ్మణు లున్నారు. —మీనాన్న బహుశా ఈలోపున అలాంటి వారిని వెతకటానికి వెళ్ళిఉంటారు" అన్నాడు.

సంధ్య యేడుస్తూ "కాదు, కాదు, అరుణదా! ఆయన ఎక్కడికీ వెళ్ళలా. భయంతో పారిపోయారు. ఇంకననెవ్వరూ స్వీకరించరు. ఎవరూ పెళ్ళి చేసుకోరు. కేవలం నువ్వే ప్రేమించాలి. చాలాకాలంనుంచి ఉన్ననామర్యాదను నువ్వే కాపాడాలి"

భయంకరమైన ఆమె విచ్చలవిడితనాన్ని చూసేసరికి అరుణ్‌కు కష్టంతోచింది. ఆమె చేతులుపుచ్చుకొని లేవతీయటానికి ప్రయత్నించేసరికి, సంధ్య అడ్డువచ్చి, "ఉహుఁ. నేనులేవను ఓపిక ఉన్నంతవరకు నీకాళ్ళదగ్గరే పడిఉంటాను. కులరక్షణజరగదన్నావే? ఎవరికులం అరుణదా? నేను బ్రాహ్మణపిల్లను కాను- మంగలి పిల్లను. అందులోకూడా సరియైన మంగలి పిల్లనుకాదు. ఈనాడు నేనుతాకిన నీళ్ళెవరూ తాగరు.

ఉస్! ఇంతటి శిక్ష నువ్వు నాకెందుకు కలిగించావ్ భగవాన్? నేను నీకేం చేశాను?" అన్నది.

అరుణ్ ఉలిక్కిపడ్డాడు. సంధ్య మనప్రకృతిలో లేదేమో-అని అతడికి హఠాత్తుగా తోచింది. ఆమె మెదడు వేడెక్కిపోవటంవల్ల ఇలాంటి వికృతపు ఊహలు కలిగాయి- అనుకున్నాడు. ఇవన్నీ జరిగిఉండవు- ఈమె మాత్రం పారిపోయి వచ్చి ఉంటుంది. ఇంట్లో ఇప్పటివరకూ ఏదో పోట్లాట వచ్చి ఉంటుంది.. ఆమెను శాంతపరచి ఇంటికి తిరిగి పంపించేద్దామనే ఉద్దేశ్యంతో- సస్నేహంగా ఆమె తల నిమురుతూ మెల్లిగా- "సరేపద, సంధ్యా! నిన్ను మీ ఇంటికి తీసుకువెడతా" అన్నాడు.

సంధ్య సాష్టాంగంగా అతడికి నమస్కరించి పాదధూళి స్వీకరించి, శిరస్సున ఉంచుకుని- "పద. నువ్వు ఇలావస్తావని తెలుసునాకు. కాని నాగాథంతా విని అప్పుడు బయలుదేరు- కాకపోతే నాకేం తెలుసు? నీకూ తెలియదేమో? ఏమన్నాను, నిన్నొకరోజున? తక్కువకులం బ్రాహ్మడివన్నాను కాదూ? ఆ పాపం మూలానే కాబోలు; నేను బ్రాహ్మణ పిల్లను కాదని రుజువు తేలిపోయింది ఈనాడు. ఉస్! మేమెలా బ్రతకటం అరుణదా?" అంది,

సంధ్య మానసికవ్యధను చూసేసరికి అరుణ్ మనస్సు ద్వైధీ భావంలో పడింది. బహుశా నిజంగానే ఏమన్నా జరిగిందికాబోలు-అని తోచింది. బహుశా యధార్థవిషయాన్నే చెబుతోందేమో! మెల్లిమెల్లిగా "ఈ సంగతి ఎవరు రుజువుచేశారు?" అని అడిగాడు.

"ఎవరా ? గోలోకఛటర్జీ. ఆఁ. ఆయనే. ఆయన నాతో ఏమన్నాడో తెలుసా ? తెలియదూ ? సరే, ఆసంగతి అలా ఉంచు. కన్యాదానం చేయటానికి మా అమ్మ కూర్చుని ఉంది. మా నాయనమ్మ అక్కడే మెదలకుండా కూర్చుని ఉంది. ఆ సమయంలో పెళ్ళిళ్ళు కుదిర్చే మృత్యుంజయ్ భట్టాచార్యులు ఇద్దరు మనుష్యులను వెంటబెట్టుకొని ప్రత్యక్షమయినాడు. అందులో ఒకడు మా నాయనమ్మను పిలిచి 'తారాదీదీ ! మమ్మల్ని గుర్తించారా ?' అని అడిగాడు. రెండో వ్యక్తి మా అమ్మను చూపిస్తూ, 'నువ్వు నీకొడుక్కి-ఈమెను చేసుకుని ఈ బ్రాహ్మణపిల్ల కులం పాడుచేశావు. మళ్ళీ మనుమరాలి పెళ్ళిచేసి వీరికులంకూడా చెడుస్తావా ?' అని - తర్వాత మా నాన్నను చూపిస్తూ — 'మీరంతా వినండి. ఈ ప్రియముఖర్జీని మీరంతా కులీన బ్రాహ్మణుడని అనుకుంటున్నారు-ఆయన బ్రాహ్మడు కాడు-మంగలిహీరాయి కొడుకు' అన్నాడు."

'అదేమిటి ? అలా వాగుతున్నావు సంధ్యా ?" అన్నాడు అరుణ్.

సంధ్య కీ ప్రశ్న వినిపించ లేదల్లేఉంది. తాను చెబుతూ ఆపిన కథను మళ్ళీ అందుకుని చెప్పటం మొదలెట్టింది. "మృత్యుంజయ భట్టాచార్యులు గంగాజలం నింపిన ఘటం తీసుకొచ్చి మా నాయనమ్మ ముందర పెట్టి - 'నిజం అవునా కాదా చెప్పు ? ఎవరి కొడుకో యదార్థం చెప్పు ? ముకుంద ముఖర్జీకొడుకా; మంగలి హీరాయి కొడుకా ? చెప్పు -' అని అడిగాడు...అరుణ్ దా ! సన్యాసిని అయినా మా నాయ

నమ్మ తలవంచుకుంది. అబద్ధం చెప్పలేకపోయింది. 'ఇది సత్యమేనండీ ! భయంకర సత్యం. నిజంగా మీరనుకుంటున్నట్లు బ్రాహ్మణిని కాదు నేను. మీ సంధ్య బ్రాహ్మణపిల్ల కాదు' అన్నది."

అరుణ్ మనస్సులో సందేహం ఇంక లేశమాత్రం కూడా లేకుండాపోయింది. కేవలం పిడుగుపడ్డ వాడిలాగా నిశ్చేష్టుడై నిలబడ్డాడు.

"అప్పుడో కాయన జరిగినదంతా విపులంగా చెప్పాడు. అతడు ఆ ఊరివాడే. మా నాయనమ్మకు ఎనిమిదోయేట అయిందట పెళ్ళి. తర్వాత పధ్నాలుగు, పదిహేనేళ్ళకు ఒకతనువచ్చి 'నేను మీ అల్లుణ్ణి, ముకుందముఖర్జీని-' అని చెప్పి ఇంట్లో ప్రవేశించాడట ! అతడు అయిదు రూపాయలూ, ఒక కొత్త పంచలచాపు తీసుకుని రెండు రోజులుండి వెళ్ళిపోయాట్ట !...ఓయి భగవంతుడా !" అన్నది సంధ్య.

అరుణ్ అలాగే నిశ్చేష్టుడై మెదలకుండా ఊరుకున్నాడు.

"ఏం చెప్పాను అరుణదా ? ఆఁ. ఆఁ, జ్ఞాపకం వచ్చింది. ఆ తర్వాత అతడు అప్పుడప్పుడు వస్తూఉండేవాడట ! నాయనమ్మ ఆ రోజుల్లో చాలా అందంగా ఉండేదిట ! ఆ తర్వాత వాడు డబ్బు తీసుకునేవాడు కాదట ! తర్వాత ఒకరోజున వాడు పట్టుబడ్డాడు. అప్పటికి మానాన్న పుట్టాడట !—నేనే కనుక తల్లినైనట్లయితే మెడపిసికి చంపేదాన్ని - కాని పెంచి పెద్దవాణ్ణి చేసేదాన్ని కాదు. ఏం చెప్పాను అరుణదా ?"

అరుణ్ అస్ఫుటస్వరంతో – 'వాడు పట్టుబడ్డాడు' అన్నావు" అన్నాడు.

"ఆఁ. ఆఁ. అదే పట్టుపడ్డాడు! అప్పుడు వాడు ఏమని ఒప్పుకున్నాడో తెలుసా ? ఈ వెధవ పని తాను బుద్ధి పూర్వకంగా చెయ్యలేదన్నాడు. తన యజమాని ముసుందముఖర్జీ ఆదేశానుసారమే చేశాట్ట ! ఆయన ముసలివాడు, అందులో పైగా అయిదారేళ్ళనుంచీ పక్షవాతమట ! అంచేత అపరిచి తురాలైన భార్య వద్దనుంచి డబ్బు గుంజేభారం వాడిమీద పెట్టి – 'హీరాయి ! నువ్వు బ్రాహ్మల పేర్లన్నీ కంఠస్థం చేసుకో, జంధ్యాలు సిద్ధంగా ఉంచుకో. ఈనాటినుంచి రోజూ నువ్వు వాళ్ళను పీడించి తెచ్చే డబ్బులో నీకు సగం; నాకు సగం' అన్నాట్ట"

అరుణ్ తుళ్ళిపడి, "అతడిలాంటి పనులు ఇంకా చేశాడటనా ?" అన్నాడు.

"ఆఁ. ఇంకా పదిపన్నెండు చోట్లల్లో అతడు ఇలాగే చేసి రోజూవచ్చే ఆదాయములో కొంతభాగం తన ప్రభువుకు సమర్పించేవాడట ! అతడింకా ఏం చెప్పాడో తెలుసా ? 'ఇలాంటిపని ఇదేం కొత్తకాదు. కేవలం మా యజమానే ఇలాంటిపని చేయలా. ఇలా ఎంతోమంది బ్రాహ్మణులు దూర దేశాల్లోఉండి, ఇతరుల సాహాయ్యంతో ఇదొక వ్యాపారంగా చేస్తున్నారు' అని చెప్పాడు."

అరుణ్ కోపంతో గర్జిస్తూ "ఇది అక్షరాలా యథార్థమే అయిఉంటుంది. లేకపోతే బ్రాహ్మణ కులంలో గోలోక ఛటర్జీలాంటి కసాయివాడు ఎలాపుడతాడు ? పైగా ఇలాంటి

వాళ్లే హిందూసంఘానికి శిరోమణులై కూర్చున్నారు. తర్వాత ?'' అన్నాడు.

"తర్వాత మా నాయనమ్మ ఆ పిల్లవాణ్ణి తీసుకుని కాశీ వెళ్ళిపోయింది. అప్పటినుంచీ ఆమె సన్యాసిని అయింది అప్పటినుంచీ ఆమె తన ముఖాన్ని ఎవరికీ చూపించటంలా— హీరాయి ముకుందముఖర్జీని - 'ప్రభూజీ ! పరలోకంలో సమాధానం ఏమని చెప్పుకోను' అని అడిగాడుట !' 'ఆపాపం నాది. దానికి సమాధానం నేను చెప్పుకుంటానులే' అన్నాడట ఆయన. 'అయితే ఆ ఆడవాళ్ళ గతేమిటి దేవా ?' అని అడిగాడట వాడు. ఆయన నవ్వుతూ, 'వాళ్లు నా భార్యలు కాని, నీ భార్యలు కారు. నీకెందుకింత బాధ ? వాళ్ళని నా కళ్ళతో నేను చూడలేదు - ఇంక చూడను. వాళ్ళగతేమవుతుందో - ఏం కాదో, ఆదిగులు నీకెందుకు; నాకెందుకు ! మనబెంగల్లా రోజూవచ్చే డబ్బునుగురించే' అన్నాట్ట.

"అరుణదా ! అంచేతనే ఆరోజున మా నాయనమ్మ నీ ప్రసంగం వచ్చినప్పుడు కళ్ళనీళ్ళు కారుస్తూ 'జాతివల్ల ఎవడు తక్కువో, ఎవడెక్కువో- అది కేవలం భగవంతుడికే తెలియాలి. మనుష్యులెన్నడూ ఎవర్నీ కులహీనుడని అసహ్యించుకో కూడదు' అన్నది కాని దానికర్థం ఈనాడిలా తెలుసుకోవలసి ఉంటుందని అప్పుడనుకోలేదు నేను. సరే, చాలా ప్రొద్దుపోయింది-నన్ను గురించి నువ్వెప్పుడూ బాధ పడనవసరంలేదు అరుణదా ! నీ మహత్త్వాన్ని, నీ త్యాగాన్ని

నేను జీవితంలో ఎన్నడూ మరిచిపోలేను" అని సంధ్య నిర్నిమేష దృష్టితో అతడికేసి చూస్తూ ఊరుకుంది.

అరుణ్ అనిశ్చితకంఠంతో, సంకోచంతోనూ, "కాని ఇప్పుడు నీతో కూడా రాలేను నేను సంధ్యా?" అన్నాడు.

సంధ్య చకితురాలై "ఎందుకని? నువ్వు నాతో రాకపోతే నాకు నిలిచేందుకు చోటుఏదీ? నేనెలా బ్రతకను?" అన్నది.

దరీతెన్నూ లేని ఈ ప్రశ్నకు సమాధానమేమిటో అరుణ్‌కు చటుక్కున స్ఫురించలా. తర్వాత మెల్లి మెల్లిగా "ఇవాళకు నన్ను కొంచెం క్షమించు సంధ్యా? - నన్ను కొంచెం ఆలోచించుకోనీ" అన్నాడు.

"ఆలోచించుకోవటమా?" అని తెల్లబోయి ఏకదృష్టితో అరుణ్ కేసిచూసి ఆ అంధకారంలో అతడిముఖం ఎంతవరకు పరిశీలించటానికి వీలవుతుందో అంతవరకూ పరిశీలించటానికి ప్రయత్నించింది కాబోలు! తర్వాత గంభీరంగా ఒక నిట్టూర్పు విడిచి మెల్లిగా లేచినిలబడి- "సరే, ఆలోచించుకో. కొంచెంసేపే కాదు; జీవితాంతంవరకు ఆలోచించేందుకు సమయం ఉంటుందనుకుంటా. ఒకప్పుడు నేనూ రాత్రింబవళ్ళు 'ఏక-తీరున' ఆలోచించాను. అప్పుడు నాకన్న నువ్వెంత తక్కువకులంవాడివి- అని ఆలోచించటానికి నాకేం కష్టమనిపించలా - అన్నాళ్ళూ ఇదే ఆలోచించా. ఈసారి నువ్వు ఆలోచించాల్సిన సమయం వచ్చింది. సరే, వెడుతున్నా" అని ఆమెలేచి నిలబడేసరికి ఆమె చీరచెంగు జారి కిందపడింది. ఆ చెంగు సరిగ్గా తీసుకుని సర్దుకునే సమ

యంలో ఆమెదృష్టి ఆమెమీదనే పడింది. హఠాత్తుగా వణికి పోతూ "భగవాన్! ఈ పట్టుచీరె కట్టుకునేప్పుడు, ఈ నగలు ధరించేప్పుడు, ఈ లలాటంమీద చందనరేఖలు దిద్దుకునేప్పుడు, ఇదంతా ఇలా అవుతుందని ఎవరనుకున్నారు?" అని అనబోయేసరికి ఆమె కంఠరుద్ధమైంది. ఆ కంఠస్వరంతోనే "నేను సెలవు తీసుకుంటాను అరుణదా!" అని మరోసారి నమస్కారంచేసి నిశ్శబ్దంగా బైటికి వెళ్ళిపోయింది.

అరుణ్ నిశ్చలంగా అలాగే నిలబడిఉన్నాడు. కాని దృష్టిపథంలోనుంచి సంధ్య దాటిపోగానే అతడి నిశ్చలత చలించినట్లయింది. వ్యగ్రవ్యాకులమైన కంఠస్వరంతో నౌకర్లను మాటిమాటికీ పిలుస్తూ 'శిబూ! వెళ్ళరా! వెళ్ళు. ఆమెతోకూడా వెళ్ళు-" అంటూనే అతడూ పరుగులెడుతూ ఆమెను అనుసరించాడు.

## ౧౩

ఎడమచేత్తో దీపం పుచ్చుకుని కుడిచేత్తో పెట్టెలో ఏదో వెతికితీసి- ఆ వస్తువును ఒకచిన్న గుడ్డలో మూటకడుతున్నాడు ప్రియముఖర్జీ! అంతలో హఠాత్తుగా వెనకనుంచి 'నాన్నా!' అని పిలవటం విన్నాడు.

ఆ పనేదో చాటుగానే చేస్తున్నాడతడు. హడావిడిగా చేతులోవున్న దీపం క్రిందపెట్టి లేచినుంచుని, ఏమిటి సంధ్యా? ఇదుగోనమ్మా వెళ్ళిపోతున్నాను - ఇక ఆలస్యంలేదు," అన్నాడు.

సంధ్య అతికష్టంమీద అశ్రువులను ఆపుకుని, "ఏం చేస్తున్నావు నాన్నా ?" అని అడిగింది.

ప్రియబాబు నీళ్ళు నములుతూ "నేనా ? ఏదీ ? ఏమీ లేదమ్మా !" అన్నాడు.

అతడిచేతిలో ఉన్న గుడ్డముక్క చూసి, "అందులో ఏముంది నాన్నా ? ఏమిటి మూటకట్టావ్ ?" అని అడిగింది సంధ్య.

ప్రియబాబు పట్టుబడిపోవటంవల్ల సిగ్గుపడి, కొంత వినయస్వరంతో "కొంచెమే, ఎక్కువ కాదమ్మా ! ఈ రెమెడీలు వెంటతీసుకు వెడుతున్నాను-ఈ 'మెటీరియా మెడికా' కూడా పెద్దదికాదు-చిన్నది. చిరిగిపోయింది కూడా- ఎరగని చోటు, ఏమయినా కొంచెం ప్రాక్టీసుచేసుకోవాలిగా? అందుకనే తీసుకువెడదా మనుకున్నాను" అన్నాడు.

"నువ్వు ఈ కాసినయినా తీసుకెళ్ళటానికి అమ్మ వప్పుకోలేదా ?"

ప్రియబాబు అనిశ్చితభావంతో తలతిప్పుతూ ఏం చెప్పాడో సరిగ్గా తెలియులా.

"నువ్వు ప్రాక్టీసు ఎక్కడ చేస్తున్నావు నాన్నా ?"

"బృందావనంలో. అక్కడి కెంతోమంది యాత్రీకులు వస్తూపోతూ ఉంటారు. వాళ్ళకు మందులిస్తూంటే నెలకు అయిదారు రూపాయలయినా రాకపోతాయా, సంధ్యా ? ఆ మాత్రం వస్తే నాకు బాగానే గడిచిపోతుంది."

"తప్పక వస్తాయి నాన్నా ! ఇంకా ఎక్కువకూడా వస్తాయి. కాని అక్కడ ఎవర్నీ ఎరగవుగా ! మొన్న తెల్ల

వారగట్ల నాయనమ్మ కాశీ వెడితే- నువ్వు ఆమెతో కూడా ప్రయాణం కాలేదెం చేత నాన్నా ?"

"అమ్మతోనా ? కాశీకా ? లేదమ్మా, ఇంక నేనెవరికీ బాధ కలిగించదలుచుకోలేదు. నామూలంగా మీరు చాలా కష్టాలనుభవించారు. ఇంక నేనెవరికీ దుఃఖం కలిగించను. ఇక బ్రతికినన్నాళ్ళూ ఆ అజ్ఞాతప్రదేశంలో నేను ఒంటరిగా పడి ఉంటాను."

సంధ్య తండ్రిదగ్గరకు జరిగి ఆయన చేతులు రెండూ తన చేతుల్లోకి తీసుకుని-"కాని నిన్ను నేను ఒంటరిగా ఉండనీయను నాన్నా ! నేనుకూడా నీతో వస్తా" అంది.

ప్రియబాబు మెల్లి మెల్లిగా తనచేతుల్ని లాక్కుని, కుమార్తె తలనిమురుతూ నవ్వి, "ఛీ ! పిచ్చిపిల్లా ? అదేమిటి? నాతో నువ్వు ఎక్కడికి వస్తావమ్మా తల్లీ ? మీ అమ్మదగ్గిర ఉండు నువ్వు. ఆమెకూడా చాలా దుఃఖాలపాలయింది. నా మందుకోసమని ఎవరైనా వస్తూవుంటే వాళ్ళకు మందులిస్తూ ఉండుఅమ్మా ! ఇదుగో చూడు సంధ్యా ? నా పుస్తకాలన్నీ మీ అమ్మనడిగి ఇవ్వమంటే విపినుడికి ఇచ్చెసెయ్. అతడు పాపం బీదవాడు. పుస్తకాలు కొనుక్కుని చదువుకోలేక పోవటం మూలంగానే అతడాక్టే వైద్యం నేర్చుకోలేక పోయాడు" అన్నాడు.

సంధ్య తల ఊగిస్తూ "కాదు నాన్నా ! నేను నీతో కూడా వచ్చితీరుతా. ఇదిగో చూడు; నా చీరెలు రెండు ఈ

తువాల్లో మూటకట్టి తీసుకొచ్చాను" అని ఆమె ఆ చిన్న మూట తీసి చూపించింది.

ప్రియబాబు ఏనాడూ ఎదిరించి మాట్లాడి ఎరగడు. అతడు ఒప్పుకుని "సరేపద, కాని మీఅమ్మ నీకోసం చాలా దుఃఖపడుతుంది సంధ్యా!" అన్నాడు.

మొన్న సర్వసహాక్షుంలో సంఘీయులాదరి ఎదటా తండ్రికి కలిగినదుర్గతి సంధ్య తన కళ్ళారా చూసింది. జగద్ధాత్రి స్వంత ఇల్లుకనుక ఇంత రభసజరగటం సంభవించింది. ఈ అవమానం సంధ్య నరనరాలకూ పట్టిపోయింది. కాని సమాధానంలో ఆవిషయమేమీ తీసుకురాకుండా, "కాదు నాన్నా! నేనేమాత్రం ఉండను. నేనువచ్చేస్తా. నేను కూడా ఉండకపోతే నిన్నెవరు చూస్తారు? నీకు వంట ఎవరు చేసిపెడతారు!" అనటం మొదలెట్టింది.

ఇలా అని ఆమె తండ్రి మందులను, పుస్తకాలను ఒక గుడ్డలో మూటకట్టేసి, అతడి చెయ్యిపట్టుకుని, "పదనాన్నా! మన మిప్పుడే బయులుదేరుదాం. లేకపోతే పన్నెండు గంటల బండి బహుశా అందుకోలేము." అంది.

తల్లి - తలుపులు బిగించుకుని లోపలకూర్చున్న గది ముందరకెళ్ళి-సంధ్య సాష్టాంగంగా నమస్కరించి, "అమ్మా! వెడుతున్నామమ్మా మేము. రెండుచీరెలుతప్ప ఇంక నేనేమీ తీసుకువెళ్ళడంలేదు" అని ఆక్రందించి ఏడ్చింది. కాని లోపలి నుంచి జవాబేమీ రాలేదు. చటుక్కున పమిటచెంగుతో కళ్ళుతుడుచుకుని, "అమ్మా అపకీర్తి, అసహ్యాలంతాలూకు

మాలిన్యాన్నంతా ముఖానికి పూసుకునే వెడుతున్నాం మేము. మీ సంఘంలో దీన్నిగురించి విచారణ ఏమీ జరగదు-కాని ఎవరి మహాభారాన్ని మేము నెత్తినవేసుకుని ఇవాళ వెళ్ళిపోవాల్సి వచ్చిందో, కనీసం వారిని విచారించడానికైనా ఒకరున్నారన్న సంగతి ఒకనాటికి నీకు తెలిసి వస్తుంది" అన్నది. గదిలోపలిభాగం మొదటిలాగానే నిశ్శబ్దంగా ఉంది. తలుపులు అలాగే మూసిఉన్నాయి. సంధ్య తండ్రివెనకాలనే ఇంట్లోంచి బైటికివచ్చేసింది. ఎవరో ఒక వ్యక్తి సమీపంలో ఉన్న చెట్టుకింద నుంచుని ఉన్నాడు. దగ్గిరకువెళ్ళగానే ప్రియబాబు- వెన్నెట్లో అతడెవరైందీ గుర్తించి, "ఎవరు ? అరుణ్‌కదూ ?" అన్నాడు.

"చిత్తం, అవునండీ- ఇవాళ మీరు పన్నెండుగంటల బండికి వెడతారని విని చూద్దామని వచ్చాను."

"ఆఁ. చూశావుగా ఈకష్టం ? మాఅమ్మాయి నన్ను విడిచిపెట్టకుండా వెంటపడింది. నేను ఎక్కడికి వెడతానో - ఎక్కడ ఉంటానో - చూడునాయనా దీనిపిచ్చితనం !"

అరుణ్‌కు నోటినుంచి మాటరాలేదు. "నువ్వూ వెడుతున్నావా సంధ్యా ?" అన్నాడు.

"ఆఁ." అని సంధ్య ఊరుకుంది.

అరుణ్ ఒక్కక్షణం మౌనంవహించి, అతి సంకోచంతో-

"ఆరోజున రాత్రి నా మనస్సును ఏమాత్రం స్థిరం చేసుకోలేకపోయాను. కాని నీమాటలకు సమ్మతించాలని ఇవాళ నిశ్చయం చేసుకున్నాను సంధ్యా !" అన్నాడు.

ప్రియబాబు ఇదేమిటో గ్రహించలేక కేవలంచూస్తూ ఊరుకున్నాడు. సంధ్య ప్రశాంతమైన కంఠంతో మెల్లిమెల్లిగా ఇలా చెప్పసాగింది —

"ఆనాడు నేనుకూడా 'అతలాకుతలం' అయిపోయాను అరుణ్‌దా! కాని ఇవాళ నామనస్సుకూ స్థయిర్యంచిక్కింది. ఆడవాళ్ళు పెళ్ళిచేసుకోవటంతప్ప పృథివిలో ఇంకే వారు చేయదగ్గ పనులు ఏమయినా ఉన్నాయా? లేవా, అన్నది తెలుసుకోవటానికే నేను మానాన్నతో వెడుతున్నాను. ఇంక మాకొట్టే వ్యవధిలేదు అరుణ్? - వీలయితే నన్ను క్షమించు" అని ఆమె తండ్రి చెయ్యిచ్చుకుని ముందుకు సాగింది. అరుణ్ వారి వెనకాలే వెళ్ళటానికి బయలుదేరే సరికి, సంధ్య నిలిచి వెనక్కితిరిగి, "వద్దు అరుణదా! నువ్వు మాతో రావద్దు ఇంటికి వెళ్ళు." అన్నది.

"ఈ కష్టదినాల్లో నువ్వు మీ అమ్మను వదిలిపెట్టి వెడతావా సంధ్యా?" అన్నాడు అరుణ్.

"ఏం చెయ్యను అరుణదా? ఇన్నాళ్ళూ తల్లిదండ్రుల నిద్దర్నీ సేవించే సౌభాగ్యం కలిగింది నాకు. కాని ఇవాళ ఒకర్ని వదిలెయ్యాల్సి వచ్చింది. అయినా మాఅమ్మకు ఒక ఉపాయం ఉండనుకుంటాను నేను. నిన్న ఎంతోమంది ఈ తమాషా చూడటానికి వచ్చినవారిలో కొందరు, దీనికి ఓ ప్రాయశ్చిత్తం ఉండని చెప్పారు. ఉంటే మంచిదే. అప్పు డింక ఆమెను కనిపెట్టుకుని ఉండేవాళ్ళకు లోటు ఉండదు. కాని నేనుతప్ప మానాన్నను కనిపెట్టుకుని ఉండేవాళ్ళు ఈ

ప్రపంచంలో ఎవరూ లేరు - ఇంక నుంచుంటే కాదు, నాన్నా పద.” అని సంధ్య మళ్ళీ ఇంకొంచెం ముందుకు సాగింది. అరుణ్ అక్కడే స్తబ్దుడై నుంచుండిపోయాడు.

మరికొంత దూరం వచ్చేసరికి దారిలో కొందరు రకరకాల భోజనపదార్థాలను ప్రశంసించుకుంటూ తాంబూలాలు నములుతూ వెళ్తూండటం కనిపించింది. వాళ్ళ ఆనందానికీ, సంతృప్తికీ అంతులేకుండా ఉంది. వెన్నెల కాంతిలో వాళ్ళు తమను గుర్తుపడతారేమో అన్న భయంతో సంధ్య తండ్రి చెయ్యిపట్టుకుని మార్గానికి ప్రక్కకు వెళ్ళి నిలబడి, నిలబడి వారంతా వెళ్ళిపోయిన తర్వాత మళ్ళీ బయలుదేర దీసింది.

ఆ సందు తిరగగానే వీరి భూరిభోజనాలకు హేతువేమిటో తెలిసింది. ప్రక్కనున్న మామిడి తోటలోంచి గోలోకఘటర్జీ మహాశయుడి ఇంటిముందర ఎంతో వెలుతురు కన్పిస్తోంది. ఏవో కలకలమూ విన్పిస్తోంది, “కూరలు ఇక్కడ పెట్టండి” “పెరుగు ఎవరు తీసుకొచ్చారు?” “మిఠాయి ఎక్కడుంది?” అని అలా రకరకాల కంఠధ్వనులలో ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనిస్తోంది.

“గోలోకఘటర్జీగారింట్లో ఇవాళ పెళ్ళిభోజనాలుకదూ! ‘కార్యకర్రామతుల’ సందర్భంలో ఆయన విందులు మహా బాగా చేస్తాడు. అయిదు ఊళ్ళలో పిలిచాడని విన్నా. బ్రాహ్మలు, శూద్రూలూ-ఎవర్నీ విడిచి పెట్టలేదట.”

అన్నాడు ప్రియబాబు. సంధ్య తెల్లబోయి, "పెళ్ళి భోజన మేమిటి నాన్నా ? గోలోక ఛటర్జీ పెళ్ళా ?" అన్నది.

"ఆఁ. ప్రాణకృష్ణముఖర్జీ కూతుర్ని చేసుకున్నాడుగా! మొన్ననే లగ్నం జరిగింది."

సంధ్య నోట్లోంచి "హరిమతినా ?... ఆ భోజనాలా?". అనే మాటలు మాత్రం బయిటికి వచ్చాయి.

"అవునవును. పేరు హరిమతే. బీదబ్రాహ్మడు బతికి పోయాడు - పిల్ల పెద్దదికూడా అయింది - అదేమిటే ?" అన్నాడు ప్రియబాబు.

"ఏంలేదు నాన్నా, పద. ఇక్కడనుంచి మనం త్వర త్వరగా వెళ్ళాలి."

ఇలా అని సంధ్య తండ్రి చెయ్యిపట్టుకొని రైలుస్టేషన్‌కు ప్రయాణమయింది.

తండ్రినితీసుకుని సంధ్య స్టేషనులోకి వచ్చేసరికి అప్పటి కింకా రైలు రావటానికి అరగంట ఆలస్యం ఉంది. పల్లెటూరి చిన్నస్టేషన్. అందులో రాత్రికూడా అవటంవల్ల జనం ఆట్టే లేరు. ప్లాట్‌ఫారంమీద ఒకప్రక్కన గన్నేరుచెట్టు నీడను మాత్రం ఎవరో ఒకస్త్రీ కూర్చుని ఉంది. ఆమె వీరిని చూడ గానే గాభరాతో తలమీద చెంగు ముఖంమీదికి లాక్కుంది.

ప్రియముఖర్జీ కొంచెం ప్రక్కకుజరిగి నుంచున్నాడు. కాని తీక్షణమైన సంధ్యదృష్టిని ఆమె మోసగించలేక పోయింది. సంధ్య ఒక్కనిమిషం నిదానించిచూసి, ఆశ్చ ర్యంతో "జ్ఞానదాదీదీ ! నువ్వు ఇక్కడున్నావేం ?" అంది.

సంధ్య సరీగ్గా గుర్తించింది. జ్ఞానదా మరుక్షణంలోనే చేతులుచాచి సంధ్యను కౌగలించుకొని బావురుమని ఏడ్చింది. సంధ్యకు అంతులేని ఆశ్చర్యం కలిగింది. ఆమె తన దౌర్భాగ్యానికే తాను ఇదవుతూంటే, ఇంతలో తన ఇంటి ప్రక్కన మరో ఇంట్లో ఉండే దురదృష్టవంతురాలు ఇంత అధోగతి పాలైందని ఆమెకు తెలియదు. కాని ప్రియబాబు ముఖం మాడిపోయింది.

"నువ్వు ఎక్కడికి వెడుతున్నావు జ్ఞానదా అక్కా ?" అని అడిగింది సంధ్య.

జ్ఞానదా రుద్ధకంఠంలోంచి మాట బైటికిరాలా. ఆమె కేవలం తల మాత్రం ఊగిస్తూ గంతవ్యస్థానమేదో తనకే తెలియదన్నట్లు సూచించింది.

ఆ తర్వాత చాలాసేపటివరకు ఎవరూ ఏమీ మాట్లాడలా. కాని రైలువచ్చేవేళ అవుతోంది. టికెట్ కొనాలి. అంచేత ప్రియబాబు అతి ప్రయత్నంమీద "నువ్వు ఎక్కడకు వెడతావు జ్ఞానదా? టికెట్ కొనుక్కున్నావా?" అని అడిగాడు.

జ్ఞానదా అలాగే తలఊగిస్తూ "లేదు" అని తర్వాత అశ్రురుద్ధమైన బొంగురు గొంతుకతో "మీరెక్కడికి వెడతారు ?" అని అడిగింది.

"బృందావనం." అన్నాడు ప్రియబాబు.

"సంధ్యకూడా వస్తూన్నదా మీతో ?"

"ఆఁ. వస్తోంది."

జ్ఞానదా పమిటకొంగున ఉన్న ముడివిప్పి కొన్ని రూపాయలు ప్రియబాబు పాదాలదగ్గర ఉంచి, "టికెట్ ఖరీదు ఎంత అవుతుందో తెలియదు నాకు. కాని నాదగ్గర యాభై రూపాయలే ఉన్నాయి– నాకుకూడా బృందావనానికి ఒక్క టికెట్ కొని ఇవ్వండి! బృందావనంవరకు నన్నుకూడా తీసుకు వెళ్ళండి. అంతకన్న ఎక్కువ ఈపృథివిలో ఎవరీని నేను కోరేదేమీలేదు " అంది.

ప్రియనాథముఖర్జీ ఒక్కక్షణం మెదలకుండా ఊరుకుని, చివరకు మెల్లిమెల్లిగా "సరే మాతో నేరా అమ్మా!" అన్నాడు.





## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA123B142 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 29/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 151 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 152 |
| లేని పేజీలు | 1+2 |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | prateyush |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |